శైవపరిచారిణీ గ్రంథమాల. ౨౩

# శివజ్ఞాన శేఖరేః

ప్రథమభాగః.



ఘంటనామాత్యవర్య విరచితము.



బ్ర॥ శ్రీ॥ విద్వాన్ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారిచే

పరిశోధింపఁ బడి,



బ్ర॥ శ్రీ॥ కొడిమేల రాజలింగారాధ్యుల వారిచే

స్వకీయ శైవపరిచారిణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁ బడినది.

వరంగల్.

కాపీలు. ౧౦౦౦

1929

వెల. 1-4-0

బ్రి॥ శ్రీ॥ రా॥ శ్రీ ఇజ్జతాసార్ రాజా కందుకూరి బాలసూర్య ప్రకాశరావు జమీందారు గారు. విశాఖపట్టణము.

## శాశ్వతాభిమానులు.

బ్ర॥ శ్రీ॥ కామప్ప రాజయ్యగారి కొమారుడు వీరరాజుగారు. దువ్వ.
మ॥ రా॥ కొమరవెల్లి కాశయ్యగారు. వరంగల్.
మ॥ రా॥ భూపతి రత్నంగారు. వరంగల్.
మ॥ రా॥ భూపతి రామన్న గారు. వరంగల్.
మ॥ రా॥ నాగబండి కట్టమల్లయ్య గారు. వరంగల్.
మ॥ రా॥ కొండూరి వెంకటరాజం బ్రదర్సు గారు. వరంగల్.
మ॥ రా॥ కుంచం నాగయ్యగారు. వరంగల్.
మ॥ రా॥ అప్పని రామయ్యగారు. వరంగల్.

## శాశ్వతచందాదారులు.

బ్ర॥ శ్రీ పతిపండితారాధ్యుల మల్లయ్య అయ్యవార్లంగారు మట్టెవాడ.
బ్ర॥ శ్రీ॥ ముదిగొండ రాజమాంబగారి మల్లయ్య అయ్యవార్లం గారు. వరంగల్.
బ్రి॥ శ్రీ॥ ముదిగొండ బాలకోటిలింగం గారు-మున్సబ్ హెడ్ క్లర్కు. నరసరావుపేట.
శ్రీ॥ శే॥ శివదేవుని వీరేశలింగారాధ్యులవారు. వరంగల్.
మ॥ రా॥ అల్వాల దన్నగారి నారాయణ సింగుగారు. వరంగల్.
మ॥ రా॥ పెద్దివీరయ్యగారు. మట్టెముచ్చాల.
మ॥ రా॥ ములుగు కిష్టయ్యగారు. సిద్దిపేట.
మ॥ రా॥ కొమరవెల్లి శివరాజంగారి అంతయ్యగారు. సిద్దిపేట.
మ॥ రా॥ భూపతి బుచ్చిరామయ్యగారు. ముల్కనూరు.
మ॥ రా॥ చిటిమల్లి భద్రయ్యగారు. వెన్నంపల్లి.
మ॥ రా॥ చిటిమల్లి నర్సయ్య గారు. వెన్నంపల్లి.

# విషయసూచిక.

## శివజ్ఞానశేఖరే- ప్రథమ ప్రకరణం.

విషయము. పుట.



శివజ్ఞాన శేఖరే ద్వితీయ ప్రకరణం.

| విషయము. | పుట. |
|---|---|



శివజ్ఞాన శేఖరే. తృతీయ ప్రకరణం.





సంపూర్ణం.





# శివజ్ఞానశేఖరః

## ప్రథమ ప్రకరణం.



గురుస్తుతిః

శ్లో॥ వందే శ్రీగురుపాదుకాం శ్రితపదాం చేతోంబుజాతావళేః।
శ్రీమద్వర్ణిత కర్ణికాంతర కనత్సింహాసనాధ్యాసినీం।
శోణాం పాదనఖాంశుమండలరుచా రింఛోళికాభిస్స్ఫుటాం।
తత్కింజల్క సముద్యత ద్యుతిచయై రారజ్యమానామివ॥

---

శ్రీ శివాయ గురవే నమః

## శివ జ్ఞాన శేఖరము. సాంధ్ర తాత్పర్యము.

శ్లో॥ వటమూల నివాసినం మహేశం।
పటుఘోరాఘోరమూర్తి మహామీడే।
ఘటయితు మఖిలం శ్రేయో।
సటునేశం సర్వమంగళోపేతం॥

అవతారిక॥ శ్రీ శివజ్ఞాన శేఖరమును శైవ మతాభిమానియగు ఘంట నామాత్యుడు పదునైదు ప్రకరణములతో, ఆయా మతగ్రంథముల నన్వేషించి రచింపదలంచి గ్రంథారంభమున గురుస్తుతి నొనర్చుచున్నాడు.

* గురుస్తవము. *

తా॥ శిష్యుల హృదయ కమలము లందు ప్రకాశమగు కర్ణిక (అనగా కమలము మధ్యమందుగల మొగ్గ)గలదు. అందు విద్యుత్ప్రభాభాసమానమగు సింహాసనము... దును అందు కాలిగోళ్ళ కాంతి ప్రసారమున నెఱ్ఱనైన కమలముల కింజల్క ప్రభలతో

**శివస్తుతిః**

శ్లో॥ వామార్ధతో నిఖిలమంగళ సాంప్రదాయం।
శ్రీకంధరం స్వయమనామయ మద్వితీయం।
సత్యాది లక్షణ సహజం సతత ప్రకాశం।
ధామాత్మకమపి భాతి దయైకధామ॥

*** గురువందన విచారః. ***

ప్రారిప్సితస్య గ్రంథస్య నిర్విఘ్న పరిసమాప్త్యే ప్రచయగమనాయ చ గురునమస్కారః కృతః। శిష్టాచార పరిప్రాప్త విశిష్టేష్ట దేవతా నమస్కార మకృత్వా గురుచరణారవింద వందన మత్ర కథమితి చేత్, న। తదభివందనేన సర్వజ్ఞత్వ సర్వకర్తృత్వాది యుక్త చైతన్య స్వరూప పరమేశ్వర ఏవ నమస్కృతో భవతి। " యథా దేవే తథా గురౌ " ఇతి శ్రుతిః॥

---

చరణకాంతిని వహించినవా! యమనటుల చే గురుపాదుకలు విలసిల్లు చుండునో, అట్టి గురు పాదుకల నమస్కరించు చున్నాను.

*** శివస్తుతి ***

తా॥ వామభాగమున సర్వమంగళో పేతయగు సర్వమంగళయను గుత్తుక యందు విషమును గలిగి, యేకమై సత్యజ్ఞానానంద రూపమై కరుణాలవాలమై జన్మరహితమై స్వయం ప్రకాశించుచు, అవజ్ఞనో తీతమై యేతేజస్సు వెలయు చున్నదో, అట్టి జ్యోతిర్లింగ స్వరూప మగు శివతేజమునకు నమస్కారము.

*** గురువందన విచారము. ***

ఈ శ్రీగ్రంథకర్తయు, గ్రంథారంభమున నిర్విఘ్నముగా తాను ప్రారంభించి గ్రంథ పరిసమాప్తికొఱకును, యాచంద్రతారార్క మభివృద్ధి నొంది చదువు వారికిని వినువారికిని సర్వమంగళములు సంభవించుటకును, ఇష్టదేవతాస్తుతి చేయుట సంప్రదాయము.

ఇతని యాస్తుతి వలన గురుస్తుతి ప్రారంభమునఁ జేసి శివమార్గమును లోక [illegible] [illegible] గురుస్తుతిని [illegible] నభేదమును కృతు లుపదేశించుటచేత సఫలము

శ్లో॥ యథా శివ స్తథా విద్యా యథా విద్యా తథా గురుః శివవిద్యా గురుణాంచ పూజయా సదృశం ఫలమితి శివధర్మోత్తర వచనాత్। గురు మహేశయో రభేదః ప్రతీయతే॥

సూతసంహితాయామపి గురురేవ శివస్సాక్షాన్నాన్య ఇత్యబ్రవీచ్ఛ్రుతిః ఇతి॥ అపిచ॥ దైవాగమేషు మూర్త్యాతు తస్మాద్దైవాగమో గురుః॥ శుద్ధాఖ్యతంత్రే॥ నిష్కళోహి మహాదేవో నిత్యజ్ఞాన మహోదధిః। సకలో గురురూపేణ సర్వానుగ్రాహకో భవేత్॥ నాస్తి తత్త్వం గురోః పరమితి మహిమ్నస్తవే। నగురో రధికం నగురో రధికం శివశాసనతః శ్శివశాసనతః ఇతి గురుగీతాయాం। తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే। ఇతి దక్షిణామూర్తి స్తవేచ॥

---

ను సప్రమాణముగ నిరూపించుచున్నాడు.

తానారంభించిన గ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తి నొందుటకై ప్రథమ గమనము నొందుటను గురునమస్కారము చేయబడినది ఇష్టదేవతా నమస్కారమునకు శిష్టాచారమై యుండ, గురునమస్కారము మొదట నేలచేయబడినది యనగా, ఒక గురువున నమస్కరించినచో, సర్వజ్ఞత్వాది గుణ విశిష్టుడగు పరమేశ్వరునికి నమస్కరించిన నటులే యగును.

ఏలననగా శ్రుతులందు గురువుని దేవునితో సమానముగాఁ జెప్పుటయే యిందుకు కారణము.

శివ విద్యా గురువులు ముగ్గురు సమానులనియు, వీరిని పూజించినచో సమానమగు ఫలము లభింపఁ గలదనియు శివధర్మోత్తరమున నున్నది.

సూతసంహిత యందు గురువు శివుడని వచింపఁ బడినది. దేవాగమరూపుడగుటచే శివుడు విద్యారూప గురుడే.

నిష్కల సకలస్వరూపుఁడై జ్ఞానానంద మయుఁడగు మహాశివుడే గురు రూపమున నవతరించి యందరి ననుగ్రహించు నని శుద్ధాఖ్యతంత్రమున గలదు.

గురువు కన్న పరతత్త్వము వేరే లేదని మహిమ్నస్తవము బోధించుచున్నది. గురుగీత గురువు కంటె నధికమైన వస్తువు లేదనియు, ఇది శివశాసనమనియు నిరూపించుచున్నది. దక్షిణామూర్తిస్తవమున శివుడు గురుమూర్తి యని నుడువబడినది.

* గురునమస్కారః *

శ్లో॥ గురుర్దేవో మహాదేవో । గురుర్దేవ స్సదాశివః । గురుర్దేవః పరం తత్త్వం। తస్మై శ్రీ గురవే నమః॥ అంతస్తిమిర నిర్భేద । భానవే కామధేనవే। నదం తే వాసినాం కల్పతరవే గురవే నమః॥ ఏవం గురుం న మస్కృత్య తన్మాహాత్మ్యం నిర్వచన పూర్వకం వక్ష్యామః॥

* గురుశబ్దనిర్వచనం. *

శ్లో॥ గుకార స్త్వంధకారస్స్యా ద్రుకార స్తన్నిరోధకః। అంధకార నిరోధిత్వా। ద్గురురిత్యభిధీయతే । గుణాతీతం రూపాదివర్జితంచ య ద్వస్తు కరుణాకటాక్ష మాత్రాద్యేనచ తద్దీయతే, సగురుః॥ గుకారం

---

* గురునమస్కారము *

ఎవడు మహాదేవుడు సదాశివుడు పరతత్త్వమనియు నుడువ బడుచున్నాడో, అట్టిగురువునకు నమస్కారము. చీకటిని నశింపజేయు, సూర్యకిరణముల భాతి, లోని యజ్ఞానమును నశింపఁ జేయుచు, నే మహానుభావుఁడు శిష్యులకు గామధేను కల్పవృక్షములబోలె సర్వాభీష్టముల నొసంగునో, అట్టి గురువునకు నమస్కారము.

* గురుశబ్దనిర్వచనము. *

ఆ॥ గురు నమస్కార మయిన పిదప, గురుశబ్దమును నిర్వచించు చున్నాఁడు.

గు యనగా అంధకారము. రు అన దానిని తొలఁగొట్టువాఁడు గాన. గురువని నామము వచ్చినది. భక్తుల యజ్ఞానాంధ కారము నశింపజేయు వాఁడని భావము.

గు అన గుణాతీతము. రు అన రూపాది రహితము. గుణాతీతమై రూపాది రహితమైన వస్తువును కరుణాకటాక్ష మాత్రమున, నేమహాత్ముఁడు ప్రసాదింప జేయుచున్నాఁడో, అతఁడే గురుశబ్ద వాచ్యుఁడగును.

గృణాతీతి గురుః గౄ శబ్దే ఉపాదానే "అను ధాత్వర్థమును దీసికొని, గృణాతి జ్ఞాన ముపదిశతి" జ్ఞానోపదేశము చేయువాఁడు కాన గురువన బడును.

గురూపదేశము లేనిది మానవులు యేమియు నెఱుఁగ జాలరు. గురువు ఉపదేశించు జ్ఞానము- అనుబోధమని శాస్త్రమని రెండు విధములుగ జెప్పబడును.

ఈ యనుబోధమునకు పరమనియు, శాస్త్రమునకు అపరమనియు నామాంతరము గలదు.

చ గుణాతీతం। రుకారం రూపవర్జితం। గుణాతీత మహారూపం యోద ద్యాత్స గురు స్మృతః॥ యద్వాగృహ్ణాతి జ్ఞాన ముపదిశతీతి గురుః। జ్ఞానోపదేష్టేతి యావత్॥ గురూపదేశం వినా పురుషః కిమపి న వేద॥ శ్రూయ తేచతత్॥ ఆచార్యవాన్ పురుషో వేదేతి తద్జ్ఞాన ముపదిశతీతిగురుః॥

* సిద్ధాంత ప్రశంసా. *

జ్ఞానం ద్వివిధం పరాపర భేదాత్॥ జ్ఞానం ద్వివిధ మాఖ్యాతం। పరం చైవాపరం తథా। పరం చైవావబోధాఖ్య మపరం శాస్త్ర ముత్తమం॥ పరంజ్ఞాన మవబోధాఖ్యం। అపరం జ్ఞాన ముత్తమం। సాక్షాత్పరశివ వక్త్రప్రవర్తితత్వా దుత్తమం శ్రేష్ఠం శాస్త్రం సిద్ధాంతః॥

శివసమవేతి చిచ్ఛక్తి రూపమేవ బోధజ్ఞానం కేన ప్రకారేణ శాస్త్రరూపం స్యాదిత్యాశంక్య తత్కాలం తచ్ఛాస్త్రరూప ప్రాప్తి క్రమం మృగేంద్ర సూత్రేణ దర్శయతి॥

సూ॥ సృష్టికాలే మహేశానః పురుషార్థ ప్రసిద్ధయే॥ విధత్తే విమలం జ్ఞానం పంచస్రోతోభి లక్షితం॥

అస్యార్థః॥ మహేశానః పరమేశ్వరః సృష్టికాలే బిందు రిత్యుపాదానేన శుద్ధాధ్వ సృష్టిసమయే పురుషార్థ ప్రసిద్ధయే పురుషాణా మాత్మనా మర్థస్యపరాపర భోగమోక్షరూప ప్రయోజనస్య ప్రసిద్ధ

---

అపరజ్ఞానమనగా శివాది తాగమ శాస్త్రమే. ఈయాగములను సిద్ధాంతములని పేరుగలదు. శివునియందు సమవాయ సంబంధముచేత నుండెడుచిచ్ఛక్తి రూపమగుజ్ఞానమే పరజ్ఞానము.

* ఆగమశాస్త్ర ప్రశంస. *

అ॥ ఈపరజ్ఞానము శాస్త్ర రూపమును నేకాలమున నెటుల నొందినది మృగేంద్ర సూత్రముచే నిరూపించు చున్నాడు.

తా॥ పరమేశ్వరుడు సృష్టి సమయమున జీవులయొక్క భోగమోక్ష రూపప్రయోజనము కొఱకు దన పంచముఖముల నుండి జనించిన శాస్త్రరూప జ్ఞానమును సదాశివరూపుడై దన్మనాత్మక మగు జ్ఞానమును నొసగు చున్నాడు.

మె విశేష సిద్ధమెవిమల మంతత్స్వార్థ రూపంజ్ఞానంతచ్చ పాదరూపతయా పేక స్వరూపత్వాత్ । ప్రథమవర్తితహితో గ్రాహ్యం నభవతి ॥ కిం తు సౌపాధిక భేదాత్ । పంచస్రోతోభిలక్షితం అనంతరం పంచ స్రోతోభిః ఊర్ధ్వ ప్రాగ్దక్షిణో దక్పశ్చిమస్రోతోభిః అభిలక్షితా సర్వత్ర సదాశివ రూపేణ దర్శనాకార జ్ఞానంశాస్త్ర రూప జ్ఞానంచ విధత్తే॥

శాస్త్రాంతరా నధిగతంపరం మోక్ష తత్సాధనా ద్యశేషార్థ ప్రకాశకం సర్వజ్ఞోదిత సిద్ధాంత ఇత్యపరజ్ఞానం ముముక్షుభిః శ్రవణమననాదిభిః సేవ్య మితి పరాఖ్యసూత్రేణ దర్శయతి॥

సూ॥ జ్ఞానమేత చ్ఛివక్షేత్రం సంగృహాణాత్మభేషజం। పరిణామసుఖంస్వాదు విశేషగుణదర్శకం॥ అస్యార్థః॥ శివక్షేత్రం శివస్సర్వజ్ఞః పరశివః సఏవ క్షేత్రభూమిః। తదుత్థం తదుత్పన్నం సమదర్శనాది శాస్త్రాంతరవత్ కించిజ్జ్ఞ పశుప్రణీతం భవతీత్యర్థః ॥ పరిణామసుఖం మల తీవ్ర పరిపాక నిమిత్తేన అభిప్రాయాన్య మప్రేర్యతారూపం సుఖం పరిణామాన్మలస్య తీవ్రతర పరిపాక ఇతి నిమిత్తా దభివ్యంగ్యం సుఖ

---

అనగా తన్నుపాసించుటకు సదాశివ స్వరూపమును, భోగ మోక్షములు నెట్లు సాధింప వలెనది తెలిసికొనుటకు, సిద్ధాంత శాస్త్రమును ప్రాణిహితార్థమై ప్రదర్శించినాడని భావము.

అ॥ శాస్త్రాంతరముల వలన లభించ నిదియు, మోక్షము దానికి గావలసిన సాధన సామగ్రి నంతయు సంపూర్ణముగా దెలియఁజేయు నదియు, శివునిచే బ్రకటితముగ జెప్పబడిన యాగమ శాస్త్రసంబంధియగు జ్ఞానము మోక్షేచ్ఛగలవారు శ్రవణ మననాదులచేత, సాధింప వలెనని పరసూత్రము చేత నిరూపించుచున్నాడు.

తా॥ పరశివుఁ డష్టమూర్తి స్వరూపుడు కావున భూమియు, నాతని మూర్తులలో నొకమూర్తియే. అట్టి భూరూప మగు తనువు వలన జనించినది—ఇతర శాస్త్రముల వలె కించిజ్జ్ఞులగు పశువులచే జెప్పబడనిది— మలపరిపాకానంతరమే సుఖ మొసఁగునది—

వైపర్యతా రూపం ప్రతిపాద్యత్వేన యస్యేతి మధ్యమ పదలోపి బహువ్రీహి సమాసః గారుడ దక్షిణాది తంత్రవత్ సిద్ధిరేవపర ప్రయోజనమితి స్థితం భవతీత్యర్థః॥

విశేష గుణద్యోతకం। ఇతర శాస్త్రాణాం మోక్షరూప ప్రాప్యస్థానాని దర్శయిత్వా తేషా మగోచర నిరతిశయ పద నిర్వాణ రూప సర్వార్థదృక్క్రియా లక్షణ శివతత్త్వ రూప విశేష గుణస్యదర్శకం ప్రదర్శకం శాస్త్రాంతరేషు ప్రతిపాదితార్థా నంగీకృత్య తద గోచరార్థ ప్రకాశకారణేన సాంఖ్య సౌగతాది శాస్త్రవత్ శాస్త్రాంతర కల్పితమిత్యర్థః।

అనధిగతార్థ గంతృప్రమాణమితి ప్రమాణలక్షణ లక్షిత మిత్యర్థః। ఆత్మక్షేమజం ఆత్మనః మలాది సంసారవ్యాధిం పరిహృత్య శివత్వ రూప స్వకీయ రూప బలాభి వ్యంజనే ఔషధం బంధముక్తి శివత్వాభి వ్యక్తిషు పరమోపాయ జ్ఞానక్రియా యోగ చర్యా ప్రతిపాదక మిత్యర్థః।

స్వాదు మధురం కుతర్క మయ శాస్త్రాంతరవత్ కర్ణకఠోర

---

శాస్త్రాంతరముల కగోచరములైన విషయములఁ బ్రతిపాదించుచు శివతత్త్వమును గన్పింపఁ జేయునది- సంసారమను మహావ్యాధిని హరించి శివత్వమును ద్యోతనము చేయుటకు నౌషధము వంటిది- జ్ఞాన పాదము- క్రియాపాదము- యోగపాదము- చర్యాపాదము- అను నాల్గుపాదములచేఁ బ్రకాశించునది- తర్కాదిశాస్త్రములవలెఁ గర్ణకఠోరము కానిది, ఈ యపరజ్ఞానమే.

ఇట్టి ఆగమ శాస్త్రజ్ఞానమును వినుట- చదువుట- తెలిసికొనుట- జ్ఞాపక ముంచుకొనుట- పదేపదే దానిని మనస్సులో వల్లెవేయుట- మొదలగు యుపాయములచే సార్జించ వలయును.

ఇట్టిమహత్తరమైన జ్ఞానమును శివుని దెలిసికొని యాతని వలె సదానంద రూపుడై యుండదలచిన అధికారి యగు జిజ్ఞాసు వభ్యసింప వలయును.

అజ్ఞాన మహాచార్య నిగ్రహము లేనిది కలుగనేరదని గ్రంథాంతరము నందుఁ జెప్పఁబడినది.

నః ర్వోభయత్వాన్న దోషయుక్తార్థం నభవతీతి భావః। ఏతత్ జ్ఞానం పూర్వోక్త లక్షణ శాస్త్రరూప జ్ఞానం సంగ్రహణ శ్రవణ పఠన గ్రహణ ధారణ మననాదినా సమ్యగ్గ్రహణేత్యర్థః॥

ఏతాదృశ జ్ఞానాభ్యాసః శివతత్త్వ జిజ్ఞాసునా అధికారిణా కర్తవ్యః। తత్ ఆచార్యానుగ్రహం వినా నసిధ్యతి। అత్రోక్తం॥

* గురుశివాభేదః *

శ్లో॥ ప్రస్ఫుటం శాంభవో వేదః స్వసంవేద్యకరః పరం। కరోతి సచ్చిదానందం గురుభిస్సన్నిధీయతే। నిష్కళోహి మహాదేవో। నిత్యజ్ఞాన మహోదధిః। సకళో గురురూపేణ సర్వానుగ్రాహకో భవేత్। శివ విద్యా ప్రదస్సోయ మవిద్యా గ్రంథి భేదకః। శివ సిద్ధాంత తంత్రైక కర్తాహి పరమశ్శివః। తస్మాత్కారణాత్ జ్ఞానాధికారిణో యేకేచన సంతి తేషా మాచార్య నమస్కారః సర్వకామదో భవతి॥ అత్ర నమస్కారః పూజాదీనా ముపలక్షణం। అతః సాక్షాత్పరశివ

---

శాంభవ వేదమని చెప్పఁబడుచు, స్వాత్మ జ్ఞానమును గలిగించి సచ్చిదానంద స్వరూపమును బోధించు నాగమ శాస్త్రము సద్గురువు వలననే నేర్చుకొన వలయును.

నిష్కళుఁడై నిత్యజ్ఞానస్వరూపుఁడగు మహాదేవుఁడే సకలుఁడగు గురురూపమున నవతరించి యెల్లరి ననుగ్రహింపఁజేయును.

* గురుశివాభేదము. *

శివవిద్య నొసంగువాడును, అవిద్యాగ్రంధిని (అజ్ఞానమనుముడిని) విప్పువాడును, శివాగమముల రచించిన వాడును, గురుమూర్తియగు వాఁడు పరశివుఁడే.

కాఁబట్టి జ్ఞానమందభిలాష గలవారి కందరికిఁ బరశివ రూపుఁడగు గురు నమస్కారము మొదట చేయుట తప్పనిసరి.

ఆ నమస్కారము సర్వాభీష్టసిద్ధికి కారణమగును. గురునమస్కారమన నొక్క నమస్కారమే గాదు. పూజాదులుగూడ చేయవలయును. ఈయర్థము నమస్కార పదముచే సూచింపఁబడును.

కావున పరశివ భావముతో గురుపూజ చేయవలయును. అటులఁ బూజించినచో శిష్యునకు ఐహిక పారలౌకికములు సఫలము లగును.

భావనయా గురుం పూజయేత్ । తేన స భావానురూపఫలదో భవతి ॥ అన్యోక్తం ॥ మంత్రే తీర్థే ద్విజే దైవే । దైవజ్ఞే భేషజే గురౌ । యాదృశీ భావనా యత్ర । సిద్ధిర్భవతి తాదృశీ ॥ గురౌ మనుష్యబుద్ధిం యః కరోతి స నరకం ప్రాప్నోతి। తదుక్తం॥ గురౌ మనుష్యబుద్ధించ । శివలింగే శిలామతిం । మంత్రే చాక్షర బుద్ధించ । కృత్వాతు నరకం వ్రజేత్ ॥ అతఏవ॥ పరమాత్మస్వరూపాయ ॥ శివభావప్రదాయినే । నమస్శ్రీగురునాథాయ । వట్మూల బ్రహ్మమూర్తయే ॥ అథ గురుపారంపర్యం వర్ణయామి॥

* గురుపరంపరావర్ణనం. *

శ్లో. స జయతు గురుమూర్తి స్సర్వసన్నుత్యకీర్తిః
కలితుహిన పతంగః కల్మషాంధాను భంగః ।
పశుపతి సమరూపః పాటితాశేష పాపః ।
పంచశివ గతిభావః పండితారాధ్యదేవః ॥

---

మంత్రము నందును, తీర్థమునందు, దైవమునందు, బ్రాహ్మణుని యందు జ్యోతిష్యుని యందు, ఔషధము నందు గురువు నందు శివభావన యెట్టుల నుంచునో, ఆయా ఫల సిద్ధి యగునని భావము.

గురువును, దైవస్వరూపునిగా దలంచక అందరివలె నొక సాధారణ మనుష్యునిగా దలంచువాడు నరకమును జెందునని గ్రంథాంతరము నందు గలదు.

గురువునందు మనుష్యుడనుతలంపును శివలింగము నందు రాయియను తలంపును మంత్రము నందు అక్షరములను తలంపును నుంచిన వాడు నరకమును జెందును.

కావున పరమాత్మ స్వరూపుడు- శివత్వము నొసంగువాడు- వట్మూల బ్రహ్మమూర్తియు నగు గురునాథునకు నెల్లప్పుడు నానమస్కారము.

* గురుపరంపరావర్ణనము. *

ఇక శ్రీగురువుల యొక్క వంశమును సంగ్రహముగ నిరూపించు చున్నాను.

తా॥ సర్వజనులచే నుతింపఁ బడును, కలిమనెడి మంచునకు భానుకిరణ తుల్య

శ్లో॥ అద్వైతోద్ధత కుంభికుంభ దళనాకుంఠైక కంఠీరవో।
గర్వోద్దండిత పాంచరాత్రి నిబిడ ప్రాలేయ చండద్యుతిః।
పాషండాబ్జ మదద్విపో విజయతే। బౌద్ధాద్రి ఘోరాశనిః।
శ్రీమత్పండిత మల్లికార్జున గురుర్విద్వత్సభా పూజితః॥

ఏవంవిధ శ్రీమల్లికార్జునాపరావతారాయమానః శ్రీమత్పండిత మండలాగ్రణీర్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యః, పూర్వమీమాంసక బౌద్ధ సాంఖ్య తార్కిక మాయావాది చార్వాక వైతండిక పౌరాణిక శాక్త గారుడ వామ భూత తాంత్రిక మాంత్రికేత్యాది ప్రతివాది కూహక మతఖండన శీలా ప్రవీణః శివసమయ శుద్ధ శివాచార ప్రతిపాలనాధురీణస్సంసారి పాశబద్ధానాం ప్రాణినామనుగ్రహాయ సాక్షాచ్ఛివ ఏవ మల్లికార్జున పండితగురురూపేణ ప్రాదుర్భూతః॥

---

వగు తన తేజః పుంజముచేఁ బటాపంచలు జేయుచు, కల్మషముల నశింపఁ జేసి సదాశివుని యందే తన భావము నుంచి శివావతారుడని పేరు గాంచిన మల్లికార్జున పండితారాధ్యులవారు సర్వోత్కృష్టుడై వెలయుచున్నారు.

తా॥ అద్వైతమతమను గజకుంభమును బ్రద్దలుచేయుటలో, సింహము వంటి వాడును, పాంచరాత్రి మతమను మంచునకు సూర్యుని వంటివాడును, బౌద్ధుల నెడి పర్వతములకు వజ్రాయుధము వంటివాడును నగు, మల్లికార్జున పండితారాధ్యుల వారు సర్వోత్కృష్టుండై యున్నాడని యర్థము.

అద్వైత మతము, పాంచరాత్రి మతము బౌద్ధమతము మొదలైన దుర్వాద మతములను జయించి తన శివాద్వైత మతమును వ్యాపింపఁ జేసినాఁడని భావము. మల్లికార్జునాపరావతారుఁడును, వేదమార్గమును స్థాపించుట యందు నాచార్యుఁడును, పూర్వమీమాంసకులు- బౌద్ధులు- సాంఖ్యులు- తార్కికులు- మాయావాదులు- చార్వాకులు- వైతండికులు- పౌరాణికులు- శాక్తేయులు- గారుడాది తాంత్రికులు మాంత్రికులు మొదలగు ప్రతివాదుల కపటమత ఖండనకళా నిపుణుఁడును, శివాగమము లందును, అష్టావరణ పంచాచారము లందును మహాప్రసిద్ధుఁడును నైన మల్లికార్జున పండితుఁడు కీర్తిగాంచెను.

సాక్షాత్తుగా నా పరశివుఁడే ప్రాణిహితమునకై మల్లికార్జున పండిత గురురూపమున నవతరించెను.

అన్యత్రోక్తం॥ శ్లో॥ అత్రినేత్ర చతుర్బాహుః। రవామార్ధ పరిగ్రహః। అహమేవ గురుర్భూత్వా చరామి వసుధాతలే॥ అపిచ॥ శ్లో॥ లలాటలోచనం చంద్రకళామపి భుజద్వయం। అంత నిధాయ వర్తేహం గురురూపో మహేశ్వరి। చత్వారో గురవోఽభవన్ క్షితితలే సాక్షాత్స్వయం దేవతా। స్తుత్యాద్య శ్రుతి మార్గ భాక్ కలిమల ప్రద్రావణో రేవణః। రామార్యస్సుగళాంతకృ న్మునివరో। మరుళప్రభు ర్యోగిరాట్। శైవోద్ధార ధురంధర। స్సముజని శ్రీ పండితార్యో మహాన్॥ అతః పండితారాధ్య ప్రాదుర్భావ మాహాత్మ్యం వర్ణయామి॥

* మల్లికార్జున పండితారాధ్య మహిమ *

శ్లో॥ సోయం పండిత మల్లికార్జున గురు శ్రీ భీమలింగేశితు!
ద్రాక్షారామ పురోత్తమే నివసత శ్శ్రీసప్తగోదావరే। ఆవిర్భావ ము

---

మూడవ నేత్రమును, బాహుచతుష్టయమును వామభాగమునఁ బార్వతిని విడిచి నే గురురూపమున భూమియందు సంచరించెదను.

లలాటనేత్రము చంద్రకళ భుజద్వయమును విడిచి ఓ మహేశ్వరీ గురురూపమునఁ బుడమియందు నేనే సంచరించెదను. అని శివుండు వచించెను.

దేవతాంశ సంభూతులగు గురువులు నాల్గుయుగములందును వెలసిరి. వేదమార్గ పథికుఁడును, కలికల్మష సంహారుఁడును, నగు రేవణాచార్యుఁడు కృతయుగమునందు గురువు.

శివయోగియని పేరుగాంచిన మరుళాచార్యులు త్రేతాయుగమున గురువు.

సౌగత మతమును నశింపఁ జేసిన ఏకోరామారాధ్యులు ద్వాపర యుగమున గురువు

శైవమతోద్ధారమును జేసిన మల్లికార్జున పండితారాధ్యుల వారు కలియుగ గురువులు. అని గ్రంథాంతరమునందు గలదు. కావున పండితారాధ్యుల జననాదికమును వచించెద.

* మల్లికార్జున పండితారాధ్య మహిమ *

తా॥ ఆ మల్లికార్జున పండితుఁడు సప్తగోదావరీ భాసమానమగు ద్రాక్షారామ పురమునందు నివసించుచున్న భీమేశ్వర లింగమునకు బుత్రుడై జన్మించి గౌతమ గోత్ర

* గురుప్రాశస్త్యం. *

శ్లో॥ భువి నిఖిలజనానాం । భుక్తి ముక్తి ప్రదాతా । పురహర సమధామా భూరి విజ్ఞానసీమా । నిరుపమ గుణగణ్యః । స్థాపితాశేష పుణ్యః ప్రదళిత సకలార్తిః పండితారాధ్య మూర్తిః॥

శ్లో॥ శార రూపం సమాదాయ పూజాం గృహ్ణాతి శాంకరీ। గురురూపం సమాదాయ । భవపాశం లునాత్యసౌ ॥ గురుదేవం మహాదేవ మేకీభావేన భావయేత్। ద్విధా భావంచ యః కుర్యాన్నరో సౌ గురుపాతకీ॥ గురుదేవం మహాదేవ మేకీభావేన భావయేత్। త్రిషు లోకేషు విఖ్యాత స్తేనాసౌ గురు భక్తిమాన్॥ యో గురుస్స శివః ప్రోక్తో యశ్శివస్స గురుస్స్మృతః॥ యథా శివ స్తథా విద్యా। యథా విద్యా తథా గురుః॥ శివవిద్యా గురూణాంచ । భక్త్యా హ్యసదృశం ఫలం॥ పశునాథశ్శివ స్తస్మాత్పశూనాంగతి రిత్యభూత్॥ పశుపాశ విముక్త్యై గురో రాజ్ఞాం నిరీక్షయేత్ ॥ నిరాకారం నిరాలంబం । నిర్మలం సర్వకల్పకం నిర్గు

జింపుచు చూచువారలు నిర్భ్రాంతినొంద, దృష్ట్యగ్రముతో కూడ తృతీయనేత్రమును బొందెను.

* గురుప్రాశస్త్యము *

సకల మానవులకు భుక్తిముక్తులనొసంగు వాడును, శివునితో సమానమగు తేజస్సంపన్నుడును, విజ్ఞాననిధియును, అనుపమానమగు విజ్ఞానమునకు గనియును, సద్గుణసంపన్నుడును, సర్వపుణ్య కార్యములు స్థాపించిన వాడును, ఆపదబాధలఁ బోగొట్టువాడును, నగు పండితారాధ్యుల ప్రస్తుతింతును.

మఱియు, శివుండు శివరూపమును వహించి పూజనుగైకొనును. గురురూపమును ధరించి సంసార క్లేశములు ఛేదించును.

గురు శివులను సమానముగా జూడవలెను ఏకముగా జూడక వేరుగా జూచిన వాడు పాతకమునొందును. ఒకటిగా దలంచి భక్తితోఁ బూజించు వాడు త్రిలోకములందుఁ బ్రసిద్ధినొందును.

గురువే శివుడు శివుడే గురువని చెప్పఁబడినది. శివవిద్యా గురువుల నసామాన్యమ

గాం నిశ్చలం తస్మైం పరాపర పరం గురుః। ఆధారాధేయ స్వాద్యష్టమా। ద్యంత రహితం గురుః। మనసోవచసశ్చైవ గురో ర్భావ స్త్వగోచరః॥

గురుమూర్తౌ శివే భావః। శివభావో గురావపి। ఇత్యుక్త్వా భావాభావాచ్చ కుంభీపాకో నసంశయః॥ గురు మూర్తి శ్శివ స్సాక్షా న్నాన్యథాచ సురేశ్వర। తత్పాద యుగ్మే వసతి త్రైలోక్యం సచరాచరం। అంగుష్ఠాగ్రే చాష్టషష్టి తీర్థాని నివసంతిహి। నక్షత్రగ్రహ బృందాని గుల్ఫే తిష్ఠ వసంతిహి। సప్తాబ్ధయ స్సపాదర్థే తదర్థే కుల పర్వతాః। షట్త్రింశ త్తత్త్వరూపాణి నివసంతిచ జంఘయోః॥

ముక్తిఖండే। అతీవ శ్రద్ధయా సార్థం శృణు పంకజలోచన। ఆచార్యఏవ సంసార మోచన ప్రద ఉచ్యతే॥ సఏవ వేద విత్స్వయం। సఏవ మోచన ప్రదః। సఏవ సత్య చిద్ఘనః। సఏవ సర్వ ముచ్యతే। శ్రియా

---

గు భక్తితోఁ బూజింపువాఁ డసత్యశమగు ఫలంబు నొందును. బ్రహ్మాది పశువుల కధిపతి యగుటచే శివునికిఁ బశుపతి యని పేరు. పశుపాశ విముక్తికై శివస్వరూపుఁడగు గురువునాజ్ఞను శిరసావహింప వలెను. నిర్గుణుఁడై నిర్వికల్పుఁడై నిశ్చలుఁడై యాద్యంత రహితుఁడై యుండు శివస్వరూపుఁడు గురువే.

గురుభావము మనస్సునకు వాక్కునకు అందనిది. శివునియందు గురుభావము గురునియందు శివభావము నుంచనివాఁడు కుంభీపాకమను నరకము నొందును.

సాక్షాత్తు శివుఁడే గురురూపమున నవతరించును. అతని పాద ద్వయమున త్రిలోకములు వసించును బొటనవ్రేలునందు నరువది తీర్థములుండును. అతని చీలమండయందు నక్షత్రములు గ్రహములుండును. అర్ధపాదమున సప్తసముద్రములు- అర్ధపాదమున కుల పర్వతములు విలసిల్లును. అతని పిక్కలయందు ముప్పది యారుతత్త్వము లుండును.

"ఓ విష్ణుమూర్తి! నిక్కముగ శ్రద్ధగా వినుము. ఆచార్యుఁడే సంసార క్లేశములనుండి తప్పింపఁగల సాహసుఁడు. అతఁడే వేదమును గుర్తెరిగినవాఁడు. అతఁడే ముక్తిప్రదుఁడు. అతఁడే సత్యస్వరూపుఁడు. ఇదియేది యననేల! సర్వముచేయువాఁడు నాతఁడే యని ముక్తి ఖండమున వచింపఁబడినది. గురుభావ మగోచరము. గురుస్వరూపమే లింగమూర్తి. నిరా

సా రే। అశరీరం గుణో ర్భావ మాకారం లింగమూర్తికం । అనంగ మం
గ సంయుక్తం । గురు లింగం సమాశ్రయేత్ ॥

* గురుస్తోత్రం. *

చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనం । నాదబిం
దు కళాతీతం తస్మై శ్రీగురవే నమః॥

జ్ఞానశక్తి సమారూఢ । స్తత్వమాలా విభూషితః । భుక్తిము
క్తి ప్రదాతాయః । తస్మై శ్రీగురవే నమః ॥

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ । ఈశ్వరశ్చ సదాశివః । యేతే గర్భగ
తా యస్య తస్మై శ్రీగురవేనమః॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజనశ
లాకయా। చక్షురున్మీలితం యేన। తస్మై శ్రీగురవేనమః ॥ అఖండమం
డలాకార। వ్యాప్తం యేనచరాచరం। తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ
గురవేనమః॥ భవారణ్య ప్రవిష్టస్య । దిఙ్మోహ భ్రాంతచేతసః । యేన
మే దర్శితః పంథాః । తస్మై శ్రీగురవేనమః॥ అనంత జన్మ సంప్రాప్త
కర్మేంధన విదాహినే। జ్ఞానానల ప్రభావేన । తస్మై శ్రీగురవే నమః॥స్వ

---

కాయుడైన శివస్వరూపుండయ్యును సాకారుండైన గురు రూపమును వహించిన గురు
లింగమును నాశ్రయించ వలయును.

గురుస్తోత్రము.

ఎవండు చైతన్యస్వరూపుండు- శాంతుండు- నాదబిందు కళాతీతుండు నై ప్రకా
శించునో, అట్టి గురువునకు నమస్కారము

జ్ఞాన శక్తిని గలిగి తత్వమాలాలంకృతుండై భుక్తి ముక్తుల నెవ్వఁడొ
సంగునో, అట్టి గురువునకు నమస్కారము.

బ్రహ్మయు- విష్ణువు- రుద్రుండు- ఈశ్వరుండు- సదా శివుండు- ఏగురువునకు గ
ర్భగతులై విలసిల్లిరో, అట్టి గురువునకు నమస్కారము.

అజ్ఞానమను చీకటిలో గన్నులు కన్పడక వెవనలాడు శిష్యుని నేత్రము లంజు జ్ఞా
నమను కాటుకను వేసి యే పరోప కారుని చే శిష్యుని నేత్రము లంబాగుచేయంబడినవో,
అట్టి గురువునకు నమస్కారము.

అఖండ మండలాకారంవ్యాప్తమగు చరాచరమును, పరమాత్మపదమును నెవ్వనిచే

దేశికస్యైకతు నామకీర్తనం। భవేదనంతస్య శివస్య కీర్తనం। స్వదేశికస్యైవశరీర చింతనం। భవేదనంతస్య హరస్య చింతనం॥ తస్య నామ కీర్తన మాత్రేన సర్వపాపక్షయో భవతి। సర్వారిష్ట నిరసనం భవతి। సర్వాభీష్టఫల ప్రాప్తిర్భవతి॥ తస్యోదాహరణమాహ॥

శ్లో॥ మల్లికార్జున ఏవాసౌ మల్లికార్జునపండితః। నోచేత్స్మరణ దేవ। సర్వాభీష్ట ఫలం కథం॥ అహో శ్రీపండితారాధ్య పాద సేవాపరాయణః। కృతాంతంవా దండధరం మృత్యుంవా జయతి స్వయం ఇతి సాక్షాచ్ఛంభో రపరావతారాయ శ్రీగురుచన్న మల్లికార్జున పండితస్వామినే నమోనమః॥

---

జాపింపబడినదో, అట్టి గురువునకు నమస్కారము.

సంసారమను మహారణ్యమును ప్రవేశించి దిక్కు దరిదోచక మోహము నొందిన జీవాని వోలె త్రోవను గాంచ జాలక ఉన్న శిష్యునికి సేధర్మ శీలునిచే త్రోవజూపింపంబడినదో, అట్టి గురువునికి నమస్కారము.

అనంత జన్మల నుండి వచ్చుచున్న కర్మములను కట్టెలను అగ్నిచే దహింపంజేయగల సామర్థ్య మేధీయునకు గలదో, అట్టి గురువునకు నమస్కారము

శివగురు నామకీర్తన మొనరించిన శివనామ కీర్తన మొనరించి నటులే యగును, తన గురు శరీర చింతన మన్నచో హరశరీర చింత. మున్నటులే యగును.

గురు నామమును ప్రాతఃకాలమున నెవరు స్మరింతురో, అట్టి వారికి సర్వపాపములు నశించును సర్వారిష్టములు తొలంగును. సర్వాభీష్టములు గలుగును. అందును నుదాహరణము గురు బిరుదమును వహించిన మల్లికార్జున పండితారాధ్యులవారే.

మల్లికార్జున దేవుడే మల్లికార్జునపండితుండు కానిచో, తలంచినంత మాత్రముననే సర్వాభీష్టములు నేల నొసంగంగలడు, ఎవరు మల్లికార్జున పండితారాధ్యులవారి పాదసేవా పరాయణులో, వారలు, యముని నైనను - మృత్యువు నైనను జయింపంగలరు. అట్టి సాక్షాత్పర శివావతారుండగు, గురుచన్న మల్లికార్జున పండిత స్వామికి నమస్కార మొనరించెద.

శ్రీచన్నవీర గురుశేఖర ఏవ భాతి। పండితారాధ్య సద్వంశ సుధాంబుధి సుధాకరం। అస్మద్గురుం చన్నవీర గురుశేఖర మాశ్రయే॥

* గణస్తుతిః. *

అథ॥ శ్రీనంది భృంగిరిటి వీరక వీరభద్ర। చండీశ్వర ప్రమథ ముఖ్య మహాగణేభ్యః। శ్రీరుద్ర మంత్రనుత రుద్ర సహస్రకోటి। కోటిభ్య ఏవ మహదస్తు నమో మహద్భ్యః॥

నమ స్త్రయ ష్షష్టి మహాగణేభ్యః। త్రయోదశభ్యో దశషోడశభ్యః। గణేశ్వరేభ్యో గణనాయకేభ్యో। నమోనమ శ్శంకర కింకరేభ్యః॥

* యోగాచార్యస్తుతిః. *

శ్వేతాది లకులీశాంతాం। యోగాచార్య మతానుగాం। సద్వా

---

త్రింగాంచెనో, అట్టి యవాంతరారాధ్య గురువులకు నా నమస్కారము.

* స్వగురుస్తుతి. *

అజ్ఞానాంధకారమును బాపుటకు భానుతుల్యుఁడై, మల్లికార్జున పండితారాధ్య వంశక్షీరసాగరమునకు రాకాశశాంకుఁడై చన్నవీరారాధ్య నామధేయము గలిగి గురుశేఖరుఁడై యున్న నాగురుమూర్తికి నమస్కారము.

* గణస్తుతి. *

నందికేశ్వరుఁడు భృంగిరిటుఁడు వీరకుడు వీరభద్రుఁడు చండీశ్వరుఁడు మొదలగు ప్రమథగణములకును- "శ్రుత సహస్రాణి సహస్రశో యే రుద్రా అధిభూమ్యాం" ఇత్యాది శ్రుతులచేఁ గీర్తింపఁబడిన యసంఖ్యాకు లగు రుద్రగణములకును- నమస్కారము.

శంకర కింకరులగు అరువది మువ్వురు మహాగణములకును, పదమూఁడుగురు గణేశ్వరులకును నూటయఱువది మంది గణనాయకులకును నమస్కారము.

* యోగాచార్యస్తుతి. *

శ్వేతాచార్యులు మొదలుకొని లకులీశ్వరుని వరకున్న యిరువది యెనిమిది మంది

దశోత్తరశత । శివభక్తసంఖ్యాం స్మరామ్యహం॥

* బసవేశ్వర స్తుతిః *

శ్లో॥ మునియాచనయా శివాజ్ఞయా। భువి భక్త్యుద్ధరణార్థమాగతం॥ వృషరాడపరావతారతా। మహితం శ్రీబసవేశ్వరం భజే॥

* మునిస్తుతిః *

శ్లో॥ ఉపమన్యుదధీచిగౌతమ। ప్రముఖేభ్యోపి నమో నమో మునిభ్యః॥

* సోమనాథ జ్యోతిర్నాథ స్తుతిః *

శ్లో॥ నమః శ్రీసోమనాథాయ। భాష్యకర్త్రే మహాత్మనే। శైవరత్నాకరకృతే। జ్యోతిర్నాథాహ్వయాయచ॥

---

రోగాచార్యులను, వారిమతము ననుసరించిన నూటపన్నెండు మంది శివభక్తగణములను స్మరించెదను.

* బసవేశ్వర స్తుతి. *

భక్త్యుద్ధరణమునకై మునీంద్రుల కోర్కెపై శివాజ్ఞచే భూలోకమున నవతరించినట్టియు, వృషభేశ్వ రాపరావతారుఁడైనట్టియును బసవేశ్వరునకు నమస్కారము.

* మునిస్తుతి. *

ఉపమన్యువు దధీచి. గౌతముఁడు మొదలగు శైవమునీంద్రులకు వందనము.

* సోమనారాధ్య స్తుతి. *

సోమనాథభాష్యమును రచించిన మహాత్ముఁడగు పాల్కురికి సోమనారాధ్యుల వారికి శరణు.

* జ్యోతిర్నాథారాధ్య స్తుతి. *

శైవరత్నాకర మహాగ్రంథ రత్నమును రచించిన జ్యోతిర్నాథారాధ్యుల వారికి శరణు.

* మల్లనారాధ్య స్తుతిః. *

శ్లో॥ నమోస్తు మల్లయార్యాయ శైవ సిద్ధాంతవేదినే। రచి
తాయేనమహతా। శివజ్ఞాన ప్రదీపికా॥

* నాగనాథారాధ్య స్తుతిః. *

శ్లో॥ గురవే నాగనాథాయ। నమస్కారం కరోమిచ। ప్రణీతో
యేన విదుషా। సర్వాగమ సుధార్ణవః॥

* పురాతననూతనకవి స్తుతిః. *

శ్లో॥ పురాతనా నూతనాయే। శైవాగమవిశారదాః। నమస్తే
భ్యోనమస్తేభ్యః। శైవా మాహేశ్వరాశ్చయే॥ప్రణమ్య ప్రాక్తనాన్ స
ర్వాన్। నూతనానపి తత్కృతాం। ఆజ్ఞామాదాయ శిరసా। తత్ప్రసాదా
త్స్ఫురన్మతిః॥

* కవిచరిత్ర. *

శ్లో॥ విపశ్చితా సద్గురుచన్నవీర। వారాధ్య శిష్యేణశమాకరేణ।
బుధాంకయామాత్య తమాభవేన। శ్రీఘంటయార్యేణ విరచ్యతేసా॥

---

* మల్లనారాధ్య స్తుతి. *

ఏమహాత్మునిచే శివజ్ఞాన ప్రదీపిక యను సద్గ్రంథము రచింపఁబడినదో, శైవ సి
ద్ధాంత వేదియగునట్టి మల్లనారాధ్యుల వారికి శరణు.

* నాగనాథారాధ్య స్తుతి. *

ఏపండిత శిఖామణిచే సర్వాగమ సుధార్ణవమను శైవగ్రంథము విరచింపఁబడినదో,
గురుమూర్తి యగు నట్టి నాగనాథారాధ్యునికి శరణు.

ప్రాచీననూతన కవిస్తుతి.

శైవాగమ విశారదులై శైవమతస్థులై ప్రతిష్ఠగాంచిన పురాతన నూతన కవీశ్వరు
లగు మాహేశ్వరులకు నాశరణు.

* కవి చరిత్ర. *

ఈవిధముగఁ బ్రాచీన నూతన శైవగ్రంథ కర్తలకును—ఆచార్యులకును— నమస్క

### * గ్రంథరచనా హేతు నిరూపణం. *

శ్లో॥ నిబధ్నాతి శివజ్ఞానశేఖరో నామ సన్మతే। శైవాగమపురాణేతిహాసోపనిషదాం మిథః॥ విరోధం పరిహృత్యైవ శైవాచారానువర్తినాం పశుపాశపతిజ్ఞానకృతే కైవల్యసిద్ధయే॥ సర్వజ్ఞాగమవాక్యతః కతిచన శ్రుతియుక్తిముద్ధూన్వతే। కేచిత్త్వన్యథయాతి తాంత్రిసరణిం వేదేస్వతంత్రాశయాః। భిత్వా తద్భ్రమతిం తదైక్యఘటనాం కర్తుం మయారభ్యతే। సంతస్త్వద్య మృశంతు తత్కృపయా నిర్మత్సరా విస్తరాత్॥ అత్ర శాస్త్రమిదం తంత్రి రహస్యమతి దుర్లభం। శివభక్తిమతాం దద్యాన్నేతరేషాం కదాచన॥

### * గ్రంథస్థ విషయానుక్రమణిక. *

అస్య గ్రంథస్య ప్రకరణ క్రమః॥ ప్రథమం పతినిర్దేశం ద్వితీయం

---

తించి వారి యాజ్ఞను శిరసా వహించి వారి ప్రసాదమున ప్రతిభాచాతుర్యము గలవాఁడై గురుచన్న వీరనారాధ్యులవారి శిష్యుఁడును, బుధాంకయామాత్యుని పుత్రుఁడును, శాంతుఁడును నగు ఘంటయామాత్యునిచే శివజ్ఞానశేఖరమను పేరుగల యీనిబంధన గ్రంథము రచింపఁ బడుచున్నది

### * గ్రంథరచనకు కారణము. *

శివాగమ పురాణేతిహాసోపనిషత్తులకుఁ బరస్పర ముండు విరోధములఁ బరిహరించి శైవాచారము ననుసరించిన వారికి పశుపాశపతిజ్ఞానము గలిగి కైవల్య సిద్ధి గలుగుటకును, సత్పురుషుల సంతోషమునకును నీశివజ్ఞానశేఖరము రచింపఁ బడినది.

మఱియు, కొందఱు శివాగమములనే ప్రమాణీకరించుకొని వేదశాస్త్రముల నిరుకగొట్టుచున్నారు. కొందఱు వేదముల ప్రమాణీకరించికొని శివాగమముల నిషేధించుచున్నారు. అట్టివారి యపోహను తప్పుత్రోవనే నడచుచున్నారు. వారి మనః కాలుష్యమును వదలించి వేదాగమముల యైక్యమును జేయుటకు నాచేత నీగ్రంథ మారంభింపఁ బడినది. సత్పురుషులు దయయుంచి యనసూయాపరులుగాక విమర్శింతురుగాత.

ఈగ్రంథము శివభక్తి గలిన వారికే నీఁదగియును. అతి దుర్లభమైన రహస్యవిషయములు గలిగిన దీనిని శివభక్తులు తప్పితరులకు నొసంగ గూడదు.

### * విషయానుక్రమణిక. *

ఈశివజ్ఞానశేఖరమున మొదటి ప్రకరణము పతినిర్దేశము. రెండవ ప్రకరణము. ద

తత్వభేదకం। తృతీయంచ చతుర్థంచ। పశుపాశ నిరూపకే॥ గురోః కృపాశక్తి పాతం। పంచమం పరికీర్తితం। షష్ఠం దీక్షా విధానం స్యాత్। సప్తమం లింగధారణం। లింగాంగ సంగ మాహాత్మ్య। మష్టమం పరికీర్తితం। ఆచారో గురు శుశ్రూషా। నవమో దశమితః క్రమాత్ ఏకాదశంతు దీక్షాయా। మాహాత్మ్యం ద్వాదశం స్మృతః। భక్త మాహాత్మ్యకథనం। సమాధిస్తు త్రయోదశీ। చతుర్దశీ స్మృతాంత్యేష్టి। స్తుతిః పంచదశీ గురోః। ఏతైః ప్రకరణై ర్గ్రంథో క్రియతే నాతివిస్తరం।

* పతి నిరూపణం. *

శ్లో॥ పశు రాస్తే జీవః పశు। పతి నాజీవేషు పాశతాజాండే। క్లుప్తా యేన విముక్త్యై పత్యుస్తస్యాత్య లక్షణం వక్ష్యే॥ శివం పశుపతిం వందే। పశుపాశ విలక్షణం। యస్య విజ్ఞాన మాత్రేణ। పాశ ముక్తాహి జంతవః॥ పశు పాశ విలక్షణః పతిః కీదృశ ఇత్యాకాంక్షాయాం ప్రతిపాద్యతే॥ అజడః పశుః జడః పాశః తయో ర్నియంతా పతి రితి॥ తదుక్తం వాయవీయ సంహితాయాం॥ అజడంచ జడంచైవ నియతం

---

త్వ భేదకము. మూడు నాలుగు ప్రకరణములు పశుపాశ నిరూపకములు. అయిదవ ప్రకరణము. గురు కృపారూపమగు శక్తి పాత నిరూపకము. ఆరవ ప్రకరణము దీక్షా విధానము. ఏడవ ప్రకరణము లింగ ధారణము. ఎనిమిదవ ప్రకరణము లింగాంగ సంగమహిమ. తొమ్మిదవ ప్రకరణము ఆచారము. పదియవ ప్రకరణము గురుశుశ్రూష. పదునొకండవ ప్రకరణము దీక్షామహిమ. పండ్రెండవ ప్రకరణము భక్తమహిమ. పదమూడవ ప్రకరణము సమాధివిధి. పదునాల్గవ ప్రకరణము అంత్యేష్టివిధానము. పదునైదవ ప్రకరణము స్తుతి.

* పతి నిరూపణము. *

పశువనఁగా జీవుఁడు. ఈ బ్రహ్మాండము నందు జీవులను పాశములతో గట్టి వేసిన వాఁడు పశుపతి. ఆ పశుపాశ విముక్తి కొఱకు తదధిపతి యగు పతి లక్షణమును మొదట చెప్పెదము.

ఏ మహానుభావుని యనుగ్రహము గలిగినంతనే, జంతువులు మెడత్రాడు నుండి విడిపించఁ బడినట్లు — జీవకోటి పాశమునుండి విడిపింపఁబడునో, అట్టి పశుపాశ విలక్షణుఁడగు పశుపతిని నమస్కరించెదను.

శాచ తయోరపి । పశు పాశ పతి శ్చేతి కథ్యతే త్రితయం క్రమాత్ ॥ అక్షరంచ క్షరం చైవ । క్షరాక్షర పరం తథా । తదేవం త్రితయం భూయః । కథ్యతే తత్త్వ వేదిభి రితి ॥ అక్షరః పశుః । క్షరః పాశః క్షరాక్షరపరః పతి రిత్యర్థః ॥

ఏతదేవోక్తం ఆగమేషు శ్లో ॥ శైవాగమేషు ముఖ్యం । పతి పశు పాశ ఇతి క్రమాత్ త్రితయం । తత్ర పతిః శివఃప్రోక్తః । పశవో హ్యణవో ర్థ పంచకం పాశః ॥ ఇతి పశుపాశాభ్యాం విలక్షణ స్త్వత్పతిః కథమస్తి ॥

తదుక్తం వాయవీయ సంహితాయాం ॥ ఋషయ ఊచుః శ్లో ॥ యోఽయం పశు రితి ప్రోక్తో । యశ్చ పాశ ఉదాహృతః । తాభ్యాంవిలక్షణః కశ్చి । త్కథ మస్త్యనయోః పతిః ॥ వాయు రువాచ ॥ అస్తి కశ్చిన్మహాత్మాచరమణీయ గుణాశ్రయః । పతి ర్విశ్వస్య నిర్మాతా పశు పాశ విలక్షణః ॥ అభావే తస్య విశ్వస్య । సృష్టి రేషా కథం భవేత్ । అచేతనత్వా దజ్ఞత్వా । దనయోః పశు పాశయోః ॥ ప్రధాన పరమాణ్వాది యావత్కించి దచేతనం ॥ నతత్కర్తృ స్వయం దృష్టం । బుద్ధి మత్కారణం వినా ॥

---

పశువు- అజడుఁడు- అక్షరుఁడు- అనియు, పాశము జడము క్షరము ననియు, నియంత, క్షరాక్షర పరుఁడును పతి యనియు వాయవీయ సంహితయందు గలదు.

శివాగమము లందు- పతిపశు పాశస్వరూపము విస్తారముగ జెప్పఁబడినది.

పతియనఁగా శివుఁడు. అణువులు పశువులు. అర్థపంచకము పాశము. పశుపాశ విలక్షణుఁడై పరమేశ్వరుఁ డెట్టుల నున్నాఁడని, వాయవీయ సంహిత యందిట్టుల గలదు,

పశు పాశముల కంటె వేరుగా పతియెట్టుల నున్నాఁడు. అని ఋషులు వాయుదేవుని నడిగిరి.

మునీంద్రులారా! సకల గుణాశ్రయుఁడై పశుపాశముల కంటె భిన్నుఁడైయీ ప్రపంచమును సృష్టించిన ప్రభు వొకఁడు గలఁడు. అతఁడు లేనిచో, ఈప్రపంచ సృష్టి యెట్టుల కలుగును,

జగచ్చ కర్తృ సాపేక్షం। కార్యం సావయవం యతః। తస్మాత్కార్యస్య కర్తృత్వం। పత్యుర్నపశుపాశయోః॥ పశోరపిచ కర్తృత్వం। పత్యుః ప్రేరణపూర్వకం। అయథా కరణ జ్ఞానమంధస్య గమనం యథా॥ ఆత్మానంచ పృథఙ్జ్ఞాత్వా। ప్రేరితారం తథా పృథక్। జుష్టస్తతస్తేన। అమృతత్వాయ కల్ప్యతే॥ పశోః పాశస్య పత్యుశ్చ తావదంతరమస్తియత్। భోక్తా భోగ్యం ప్రేరయితా అంతరం త్రివిధం స్మృతం॥ నాతః పరం విజానద్భి ర్వేదితవ్యంహి కించన। తిలేషువా యథా తైలం। దధ్నివా సర్పిరర్పితః। యథాస్తి తదిదం వ్యాప్తం। యథాఽగ్న్యాం హుతాశనః॥ ఇతి॥

---

ఇంతియుగాక. పశుపాశముల వల్లనే యీప్రపంచము సృష్టింపఁబడునని చెప్పవీలు లేదు. పశుపాశములు జడాజడము లగుటయే యిందుకుఁ గారణము.

ప్రధానము పరమాణువు మొదలగు వేని వలనను నీప్రపంచము సృష్టింపఁ బడదు. అదియుంగాక, అచేతన మగుటయే యిందుకు హేతువు.

మరేది కారణమన— బుద్ధిమంతుఁడగు పురుషుఁడే యీప్రపంచ సృష్టికి నిదానము. లోకములో నందుఁగూడ బుద్ధిగల మానవుల చేతనే సౌధాదికములు గట్టఁ బడుటను స్వయముగా మనము చూచుచున్నారము.

జగత్తు యొకానొక కర్తయొక్క యపేక్షతో గూడినది. అనగా నొక మహాబుద్ధిశాలిచే నిర్మింపబడినది, కార్యమెప్పుడును, సావయవము. అనఁగా వస్తురూపము. కావున, కార్యకర్త పతిగాని పశుపాశములు కావు.

గ్రుడ్డివాఁడి తెరువుచేఁ జెప్పఁబడుచు, కఱ్ఱపోటు వేసికొని త్రోవ నడచినటుల, ప్రభువుచే బోధింపఁబడుచు పశువగు జీవుఁడా యాకృత్యములఁ జేయుచున్నాఁడు.

అంత మాత్రమున పశువు ప్రధాన కర్తయని చెప్పగూడదు. మరేమన, పతిప్రేరణచే కర్తృత్వము జీవునికి గలదు గాని స్వయం కర్తృత్వము లేదని భావము.

ఆత్మను వేరుగాదలంచి పాశవిముక్తికై ప్రయత్నించి జీవుఁడు పతియనుగ్రహమున మోక్షము నొందుచున్నాఁడు.

పశువునకు— పాశమునకు— పతికిని— భోక్తకు— భోగ్యమునకు— ప్రేరకునికి యొం

ననుకథం పత్యుః సద్భావే ఽత్ర ప్రమాణాభావాత్ ॥ తథాహి । నతావ త్ప్రత్యక్షం ప్రమాణం॥ రూప కరణాదీనాం రహితత్వాత్ ॥ నాప్యనుమానం ప్రమాణం ॥ తథాహి ॥ అంకురాదికం సకార్యం సకర్తృక (కార్య) త్వాత్ ।యద్యత్ కార్యం తత్తత్స కర్తృకం। యథా ఘటః తథా చేదం తత్కర్తృకమితి॥ కిమత్ర యత్కార్యం తచ్ఛరీరి కర్తృక ముచ్యతే ॥ కింవా యత్కార్యం తదశరీరి కర్తృక మితి ॥

నాద్యః। ఈశ్వరస్య శరీరత్వాంగీకారే జీవసమానయోగక్షేమత్వేన అనిత్యజ్ఞానేచ ప్రయత్నాదిమత్వం సర్వజ్ఞతాహాని శ్చస్యాత్ ॥ నద్వితీయః। దృష్టాంతే సాధ్యవైకల్యాత్ ॥ కించ ॥ అస్మ దదృష్టాత్పాద్యత్వాత్ పరమేశ్వరాంగీకారే వైయర్థ్యాచ్చ తస్మాత్పతి స

---

తిభేదము గలదో అంతటి భేదముగలదు.

ఇంతకంటె మరేవియుఁగొంచెమును దెలిసికొనదగినది లేదు. పుష్పముల యందు నూనె యెటుల వ్యాపించి యున్నదో, పెరుగునందు నెయ్యి యెటుల యంతర్గతమై యున్నదో, అరణియందు అగ్ని యెటుల వ్యాపించి యున్నదో, అటులనే యీజగత్తు యందు పతివ్యాపించి యున్నాఁడు. అని మునీంద్రులకు వాయుదేవుఁడు చెప్పెను.

ప్ర॥ పతియున్నాఁడని చెప్పుటకుఁ బ్రమాణమేమి? ప్రత్యక్ష ప్రమాణమేనా?

ఉ॥ మానవుల వలె చేతులు, కాళ్లు మొదలగు యింద్రియములు లేకపోవుట చేతను, మనకుఁ బ్రత్యక్షముగా గన్పింపక పోవుట చేతను ప్రత్యక్ష ప్రమాణమున పరమేశ్వరుఁడున్నాఁడని నిశ్చయింప వీలులేదు.

ప్ర॥ పోనిండు. అనుమాన ప్రమాణమున భగవంతుఁడున్నాఁడని యూహింపఁగూడదా?

ఉ॥ కూడదు.

ప్ర॥ అదేమి ఒకపురుషునిచే విత్తులు నాటఁబడుటచేత నంకురాదిక మెటుల జనించుచున్నదో, అటులే జగత్తుగూడ నొక కర్తచే సృష్టింపఁబడినదని చెప్పవీలు లేదా?

ఉ॥ మంచిది. ఆకర్త అశరీరుఁడా? శరీరుఁడగునా!

ప్ర॥ శరీరియేయని వచింతుము.

ద్భావే నానుమానం ప్రమాణం ॥ నాప్యాగమః। విప్రతిపన్నం ప్రతి త స్యాప్రమాణత్వాత్ ॥ అత్రోచ్యతే ॥

అంకురాదికం సకర్తృకం కార్యత్వాదిత్యేతదేవానుమానం మానం । నను వికల్పగ్రాస మితి చేత్ ॥ న తత్ర కార్యస్య ఉత్కృష్ట విశేషైక కర్తృకత్వమాత్రేణ వ్యాప్తే రుచ్యమానత్వాత్ కర్తృ సామాన్య సిద్ధిః ॥

విశేషస్తు పక్ష ధర్మతా బలాత్ ॥ తథాహి । యది ఈశ్వర శ్శరీరి వత్స్యాత్ । మహామహీధరా ద్యుపాదాన పరిమాణ్యాది జ్ఞానవాన్న స్యాత్ ॥ తథా సతి కర్తృకత్వమేవహి ఉచ్ఛిద్యేత । ఉపాదాన గోచరాపరోక్ష జ్ఞాతే చికీర్షాకృతి మత్వస్య కర్తృకత్వాత్ ॥ ఏవం కార్యత్వ సామాన్యేన సిద్ధే పక్ష ధర్మతా బలాద్విశేష సిద్ధం॥ఏవమసంగీకారే ధూమానుమాన మప్యుచ్ఛిద్యేత॥

---

ఉ॥ శరీరియని యంగీకరించినచో, జీవునికిబోలె. సుఖదుఃఖములు ప్రయత్నము మొదలగునవి సంభవించుటయే గాక సర్వజ్ఞత్వమునకు హానివచ్చును,

ప్ర॥ అశరీరియే కర్తయనిన చో బాధయేమి?

ఉ॥ అటులదృష్టాంతముండెదటను గనపించదు గనుకను, అటులనే పరమేశ్వరుని నంగీకరించినను వైయర్థ్యము సంభవించును కనుకను, అశరీరియే కర్తయని చెప్పగూడదు.

ప్ర॥ ఆగమము ప్రమాణముకాదా?

ఉ॥ విరుద్ధవిషయమును గూర్చి యది ప్రమాణముకాదు.

ప్ర॥ అనుమాన ప్రమాణము - శాస్త్రప్రమాణము పరమేశ్వరునిచే నీజగము సృష్టింపబడినదని చెప్పుటకు కరము ప్రమాణములని కొందరు చెప్పుదురుగదా?

ఉ॥ ఔ. అవును. సత్యము. అనుమానములలో నెన్నియో విధములు లేవు. నీవుచెప్పినయనుమానము కుదరదు. అంకురాదికం సకర్తృకం కార్యత్వాత్। అనియనుమానరచన చేయవలయును.

అంకురాది రూపకార్యము కలదు, కర్తవలను గల్పించకన్నను - నెటుల కర్తృ

తథాహి। ధూమవత్త్వస్య పర్వతనిష్ఠాగ్నినా సాధ్యః॥ నాద్యః దృష్టాంతస్య సాధ్యవికలత్వాత్॥ నద్వితీయః। పర్వతస్యాగ్నిమత్త్వప్రసంగాదితి వికల్ప దూషణయో స్సమానత్వాదితి యది తత్ర ధూమవత్త్వేన వహ్నిమాత్ర సిద్ధౌ పక్ష ధర్మతా బలాత్॥ పర్వత నిష్ఠాగ్ని రిత్యుచ్యతే। క్షితిః ప్రకృతేపి నస్సమాధిరన్యత్రాపి సద్భావాత్॥

తదుక్తం పూర్వైః॥ యత్రోభయో స్సమో దోషః పరిహారోపి వా సమః। నకర్తవ్యను యోక్తవ్యస్తాదృగర్థ విచారణా। ఇతి॥ నను కార్యత్వమస్తు సకర్తృకత్వం మాభూత్॥ కింవిపక్షే బాధకం। అతో బాధకాఽభావా దప్రయోజకోయం హేతు రితి చేత్ నైవం॥

యద్యంకురాదికస్య సకర్తృకత్వం నస్యాత్। కార్యత్వమేవ నస్యాదితి హేతు లాభాంతరేవ బాధికా। అస్మదదృష్టాదేవ కార్యం భవిష్యతి చేత్ నైవం। అస్మదదృష్టాదేవ కులాలాదికం వినా ఘటాద్యుత్పత్తి ప్రసంగాత్। తస్మాన్నిరస్తాఖిల దోషేణానుమానేన ఈశ్వర సిద్ధిః॥

---

ర్వమంగీకరింపఁ బడుచున్నదో, అటులనే యీజగమును జూచిన జీవుని కంటె భిన్నుఁడై నిరస్తాఖిలదోషుఁడై సర్వజ్ఞుఁడై వెలుంగుచున్న యొక మహానుభావునిచే నిర్మింపఁ బడినటుల నూహింపఁ వచ్చును.

లోకము నందు మనకు గూడ చేయుబడిన ప్రతివస్తువును శరీరి కర్తృకముగ నపేక్షించు చున్నది.

కుమ్మరివాఁడు మొదలగు పరికరములను మనము చూచుచున్నను, కుండలగుజూది మొలాలునిచేఁజేయుబడినటుల నిశ్చయించి నటుల, అప్రత్యక్షుఁగా నున్నను బరమేశ్వరునిచేత జగము సృష్టింప బడెనని నిరూపించ వలయును.

ప్ర॥ ఈశ్వరుఁడున్నాఁడనుటకు నాగమమును బ్రమాణమేనా!

ఉ॥ ఆవును, ఆగమమును బ్రమాణమే. శ్రుతులీయర్థమునుగ నిరూపించు చున్నవి. ఏకరుఁడొకఁడే గలఁడు. రెండవ వాఁడు లేఁడు. అతఁడే యీసర్వప్రపంచమును సృష్టించె

త్ । ఏక ఇత్యనాదిత్వేనే తిత్యాది శ్రుతి ప్రమాణే నేశ్వర సిద్ధిః ॥

సకదాచి దసీదృశం జగదితి న్యాయేన కారణ పూర్వకత్వం న సంభవతి । తత్రో హేత్వో విశేషతః కర్తృ పూర్వ కత్వం మత ఇత్యాశంక్య సన్ని వేశాది మత్వేన ప్రపంచస్య కార్యత్వం సాధయిత్వా కార్యత్వేన సకలజ్ఞ్యకత్వం సాధయన్నేవకర్తృసర్వజ్ఞత్వం పరాఖ్య సార్ధసూత్రేణాదర్శయతి॥

సూ॥ మూర్తాస్సావయవా యేర్థా నానారూప పరిచ్ఛదాః। స్థూలావయవ నిష్ఠత్వా ద్బుద్ధి మద్ధేతు పూర్వకాః ॥ అస్త్యతో బుద్ధియుక్ కశ్చిదీశ్వర స్సమవస్థితః॥

అస్యార్థః॥ మూర్తాస్సాకారా స్సావయవా అవయవై స్సహితా నానారూప పరిచ్ఛదాః బహువిధాకారా వరణా యేఅర్థాః పృధివ్యాది పదార్థాః । స్థూలావయవ నిష్ఠత్వాత్॥ స్థూలాఅస్మదాది బాహ్యేంద్రియ గ్రాహ్యాః। అవయవాః తన్నిష్ఠత్వాత్ తైర్వ్యక్తత్వాత్తే కార్యభూతాః పృధివ్యాది పదార్థాః। బుద్ధిమద్ధేతుపూర్వకాః । ఉపాదానాద్యపరోక్ష జ్ఞాన వత్కారణ పూర్వకాః । అతః తస్మాత్కారణా

---

రుండొకండు గలండు.

జగత్కర్తయగు నీపశుపతియే బ్రహ్మ మొదలుకొని తృణము తాగుల్మముల వరకు గల పశుజాలమునంతటిని మలమాయాది పాశములచే (పాశములంగా త్రాడు) కట్టివేసి స్వకార్యములను జేయించు చున్నాండు.

మాయా కర్మ గుణములు, ఇరువదినాలుగు తత్వములు విషయములని వదింపంబడును. ఇవియే జీవుని బంధించు పాశములు. బ్రహ్మ మొదలు స్థావరముల వరకునుండు పశువులను మలమాయాది పాశములచే బంధించి యాయాయి పనులంజేయించుచు సర్వేశ్వరు డుండును. భక్తితో నుపాశించు పశువులను మెడత్రాడునుండి యాతండే దయచాలు విడిపించును. బ్రహ్మమొదలు కొని స్థావరముల వరకు శివాజ్ఞా పశము నందున్నవి పశువులని చెప్పంబడునని వాయు వీయ సంహిత యందుగలదు.

దృష్టిమతాం ఉపాదాన సహకారి కార్య ప్రయోజనోప కార్యాణాం అపరోక్ష జ్ఞానవాన్ సమవస్థితః సమ్యక్ప్రమాణ నిశ్చితః కశ్చి దీశ్వరః కర్తా అస్తి విద్యతే।

ఏష జగత్కర్తా పశుపతి శ్శివః। బ్రహ్మాది స్తంబ పర్యంతాన్ పశూన్ మలమాయాది పాశై ర్బధ్వా స్వకృత్యం కారయతి।

తథాచోక్తం। వాయవీయ సంహితాయాం ॥ చతుర్వింశతి తత్త్వాని మాయాకర్మగుణా అపి। విషయా ఇతి కథ్యంతే పాశాః జీవనిబంధనాః। బ్రహ్మాది స్తంబ పర్యంతాన్। పశూన్ బధ్వా మహేశ్వరః। పాశైః పశుపతిర్దేవః। కార్యం కారయతి స్వయం॥ మలమాయాదిభిః పాశై సంబద్ధాంశ్చ పశూన్ పతిః। సఏష మోచక స్తేషాం భక్త్యా సమ్యగుపాసితః। బ్రహ్మాద్యా స్థావరాంతాంశ్చ దేవదేవస్య శూలినః। పశవోహి ద్విజశ్రేష్ఠ తస్యాజ్ఞా వశవర్తినః ॥ఇతి॥

స్కాందేచ పశుపతి శబ్దనిర్వచనం ॥ బ్రహ్మాది స్తంబ పర్యంతాః పశవః పరికీర్తితాః। తేషాం పతిత్వా ద్విశ్వేశః శివః పశుపతిస్మృతః॥ అస్మిన్నర్థే శ్రుతిః। ఏషా మీశే పశుపతిః పశూనాం చతుష్పదా ముత ద్విపదామితి। ద్విపదాం చతుష్పదాం సర్వేషాం జీవానాం నియంతేత్యర్థః।

---

బ్రహ్మ మొదలు స్థావరముల వరకు నుండునవి పశువులనియు వాటికి నధిపతి యగుటచే విశ్వేశ్వరుడు పశుపతి యనియు నడువబడునని స్కాందమున గలదు. సర్వజీవులను నియమించు వాడు పశుపతి యని శ్రుతిగలదు

పురుషుని బంధించువాడు పశుపతి యని వేదము చెప్పుచున్నది. అక్షరము — పశువు. క్షరము పాశము. ఈరెంటి కంటె నతిరిక్తమైన వస్తువు పతి యని చెప్పబడును.

అజడము పశువు - జడము పాశము - ఈరెంటిని నియమించువాడు పతి. ఈపశుపతియే సర్వప్రపంచమును సృజించు చున్నాడు. ఈయనను కంటెను శ్రేష్ఠుడెవడు

కించ॥ శ్లో॥ పురుషస్య పరః పతిః । పశుపతిః॥ అబధ్నన్ పురుషం పశుమితి శ్రుతేః। అక్షరః పశురిత్యుక్తః క్షరః పాశ ఉదాహృతః। క్షరాక్షర పరం యస్తు పతి రిత్యభిధీయతే ॥ తన్నియంతృత్వాద్వా పశుపతి స్తదుక్తం ॥

అజడంచ జడం చైవా నియంతృచ తయోరపి । పశుః పాశః పతిశ్చేతి కథ్యతే త్రితయం క్రమాదితి । పశూనాం పతిరేకోయం య ఈశన్తభిః స్వశక్తిభిః । ఈష్టేచ నిఖిలాన్ లోకా నిమా నీశన ఈశ్వరః । ఏక ఏవ హరో రుద్రో నద్వితీయోస్తి కశ్చన ॥ సంసృజ్య విశ్వం భువనం గోపాయన్ సంచుకోచ సః ॥ విశ్వతశ్చక్షు రేవాయ ముతోసౌ విశ్వతో ముఖః । తథైవ విశ్వతో బాహు ర్విశ్వతః పాద సంయుతః । విశ్వస్మా దధికో రుద్రో మహర్షిరితి శుశ్రుమః ॥ వేదాహమేతం పురుషం మహాంత మమృతం పరం । ఆదిత్య వర్ణం తమసః పరస్తా త్సంస్థితం ప్రభుం ॥ న యస్మా దపరం కించిద్విద్యతేచ శివా

---

వాఁడు లేడు. ఈమహాత్ముఁడే సృష్టిస్థితిలయముల కధిపతి. ఈయుగ్రమహర్షియే విశ్వాధికుఁడు. మహాత్ముఁడు - ఆదిత్య మండలాంతర్గతుఁడు - తమస్సునకంటెఁ బరమందు వసించువాఁడు - పురుషస్వరూపుఁడు - సర్వలోక ప్రభువు - నీ పరమేశ్వరుఁడే.

ఈశివునికంటె వేరైన పదార్థ మేమియును లేదు. ఈలోకేశ్వరునిచే జగమంతయును వ్యాపించి యున్నది. ఈఁడొకఁడె వృక్షమువోలె యాకసమునందు వసించుచున్నాఁడు. ఈతని సంకల్పము చేతనే చరాచర ప్రపంచము జనించుచున్నది.

సర్వభూత గుహావాసియు, సర్వానన శిరోగ్రీవుఁడు నగుటచే శివుఁడు సర్వవ్యాపకుఁడని కీర్తింపఁ బడుచున్నాఁడు.

ఎవఁడు చెవులు లేకున్నను వినుచున్నాఁడో, ఎవఁడు నేత్రములు లేకున్నను జూచుచున్నాఁడో, ఎవరిని దెలిసికొనినవారు లేరో, అట్టి మహానుభావుఁడగు మహేశ్వరుఁడే పురాణపురుషుఁడని పేర్కొనఁ బడుచున్నాఁడు.

అతఁడు అణువుకన్న నణువును, మహత్తుకంటె మహత్తును నగు. మహామహిమశాలియు, ప్రాణికోటి యొక్క యాత్మ గుహావాసియు, నగు నీశ్వరుని నాతని యనుగ్ర

జ్ఞాత్వా దేవం సర్వ పాశాప హానిః। క్షీణైః క్లేశై ర్జన్మ మృత్యు ప్రహాణిః । తస్యధ్యానా న్మూలమాయావిభేదే। విశ్వేశ్వరం యాతి కైవల్య రూపం। ఏతత్ జ్ఞేయం నిత్యమే వాత్మ సంస్థం । నాతః పరం వేదితవ్యం హి కించిత్ । అస్తి కశ్చి త్స్వతస్సిద్ధః స్వస్య జ్ఞాన సుఖా ద్వయః। విశ్వస్య జగతః కర్తా పశుపాశ విలక్షణః ॥

ఆకాశాదీని భూతాని పంచ తేషాం ప్రకీర్తితాః। గుణాః శబ్దాదయః పంచపంచ కర్మేంద్రియాణిచ ॥ జ్ఞానేంద్రియాణి పంచైవ ప్రాణాద్యా దశవాయవః। మనో బుద్ధి రహంకారో చిత్తం చేతి చతుష్టయం। తేషాం కారణ భూతైకా ఉ విద్యా షట్త్రింశకః పశుః ॥ విశ్వస్య జగతః కర్తా పశోరన్యః పరశ్శివః । తమేవ పరమం జ్ఞాత్వా మృత్యుపాశా ద్విముచ్యతే ॥ యథా తమస్తం సదివా నరాత్రి ర్నసద్వ్యసత్। కేవలం శివ ఏవైకో యతః ప్రజ్ఞా పురాతనా॥ నైన మూర్ధ్వం నతిర్యచ్చ నమధ్యే పరి చాగ్రహీత్ । నతస్య ప్రతిమా నాస్తి తస్య నామా మహద్యశః । ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ

---

ఆత్మయందు వసించు నీతని దెలిసి కొనవలెను. ఇంతకంటె నెవనిని దెలిసి కొనదగిన వాడు లేడు.

కావున సత్యజ్ఞాన స్వరూపుడయి స్వతస్సిద్ధుడయి పశుపాశ విలక్షణుండయి జగత్కర్తయగు నొక సర్వేశ్వరుడు గలడు.

భూమి, జలము, అగ్ని, వాయువు- ఆకాశము - అను పంచభూతములు. గంధము, రూపము రసము- స్పర్శము - శబ్దము - అను పంచ తన్మాత్రలు, చర్మము- నేత్రము, చెవులు- నాలుక - ముక్కు- అను పంచజ్ఞానేంద్రియములు, వాక్కు - పాణి- పాద- పాయువు- ఉపస్థ అను పంచ కర్మేంద్రియములు, ప్రాణవాయువు- అపాన వాయువు వ్యాన వాయువు- ఉదానవాయువు - సమానవాయువు- నాగ కూర్మ కృకర దేవదత్త ధనంజయ వాయువులు- అన్నియు గలిసి పదివాయువులును, మనస్సు- బుద్ధి- చిత్తము అహంకారము- అను అంతః కరణ చతుష్టయమును - వీటికి గారణ భూతమగు విద్యయును షట్త్రింశత్తత్త్వములనబడును. వీనితో గూడిన వాడను పశువు. పశువనంటె నతీతుడు

సర్వ భూతాంతరాత్మా । సర్వాధ్యక్షః సర్వ భూతాధివాసః సాక్షీచేతా నిర్గుణః కేవలశ్చ । అతశ్చ సంక్షేప మిదం శృణుధ్వం శివః పర ప్రాప్తిరికృతేశ్చ పుంసః । ససర్గ కాలేచ కరోతిసర్వం । సంహార కాలే పునరాదదాతి ।

శ్లో॥ భూతేశాయ నమోనమో భగవతే భూతాత్మనే భూయసే।
భూత్యాలేప సుధావదాత వపుషే భూషా భుజంగద్యుతే ।
పంచబ్రహ్మ మయీ స్తనూ ర్ధృతవతే పంచాత్మ కృత్యోచితా।
మాయాకర్మసు పాశజాల తిమిర ప్రధ్వంసి తిగ్మాంశవే ॥

ఇతి శ్రీగురు చన్న వీరనా రాధ్య పాదార వింద పుష్పంధయ హృదయ ఘంటనామాత్య వర్య విరచితే శ్రీశివజ్ఞాన శేఖరే పతి నిరూపణం నామ ప్రథమ ప్రకరణం. సమాప్తం.

---

పశుపతి జగత్కర్తయగు పరశివుఁడతఁడే.

పరాత్పరుఁడగు శాకిని దెలిసి కొనుట వలన ప్రాణులు మృత్యు పాశము నుండి విముక్తులగు చున్నారు. శివుఁడు తమస్సుకంటె పరుఁడు. సదసద్వ్యాప్తుఁడు. అతనికి దివారాత్రులు లేవు. అతనికి సదృశుడెవ్వడును లేఁడు.

అపరమేశ్వరుఁడొక్కరుఁడే సర్వభూతాంతర వ్యాపియై నిర్గుణుఁడై కేవలుఁడైనై తన్యసాక్షియై ప్రకాశించుచున్నాఁడు. అతఁడే పతియనఁ బడును.

ఇంతియేల? సంక్షేపముగా వచింతును, వినుము. ప్రకృతికంటె భిన్నుఁడగు సాక్షియగు శివుఁడు సర్వమును సృష్టి కాలమున సృష్టించును, సంహార కాలమున సంహరించుచు నుండును. అతఁడే పతి యనఁ బడును.

భూతనాథుఁడు- భూతిభూషితుఁడు- భుజంగాలంకృతుఁడు- పంచకృత్య నిర్వాహణమునకై సద్యోజాత వామదేవా ఘోరతత్పురుషే శానములను పంచ మూర్తులను ధరించి మాయాకర్మ పాశమను చీకటిని హరింపఁ జేయుట యందు చండభానుఁడై వెలయు చున్న యీశ్వరునికి నానమస్కారము.

శ్రీ గురుచన్నవీర నారాధ్యులవారి శిష్యుఁడగు ఘంటనా మాత్యునిచే రచింపఁ బడిన శివజ్ఞాన శేఖరమునఁ బతినిరూపణమను పేరుగల ప్రథమ ప్రకరణము ముగిసినది.

# శివజ్ఞానశేఖరే ॥

## ద్వితీయ ప్రకరణం.

* పతివిశేష స్వరూప నిర్ణయప్రతిజ్ఞా. *

శ్లో॥ పత్యుస్సామాన్యతః పూర్వం । లక్షణం ప్రతిపాదితం ।
అధునా తద్విశేషాణాం యథా శృత్యభిధీయతే ॥

* శివస్తుతిః *

శ్లో॥ ఐశ్వర్యపరమం తత్వ । మప్రమేయ మనామయం ।
శాశ్వతం శంకరం శశ్వ । దీశ్వరం సంశ్రయే శ్రియే ।

* తత్వత్రయవిచారః *

అథ తత్వం త్రివిధం । శివ సదాశివ మహేశ్వర భేదాత్ । తత్ర శివో నిష్కలః । సదాశివ స్సకల నిష్కలః । మహేశ్వర స్సకలః ॥ తత్ర శివస్త్వేకః । సదాశివః పంచవిధః । మహేశః పంచ వింశతి భేదకః । ఏతేషాం తత్వ మేక త్రింశత్ప్రకారం భవతి ॥

---

* పతివిశేష స్వరూపనిర్ణయప్రతిజ్ఞ. *

పూర్వప్రకరణమునఁ బతిసామాన్య లక్షణము నిరూపింపఁబడినది. ఈప్రకరణమున పతివిశేష స్వరూపము నిర్ణయింపఁ బడుచున్నది.

* శివస్తుతి *

ప్రమాణాతీతుఁడు - శక్తిసహితుఁడు - అనామయుఁడునగు శంకరుని మోక్షసంపద కొఱకు నాశ్రయించెద.

* తత్వత్రయవిచారము. *

పతియే తత్వమనఁబడు. ఆతత్వము శివ - సదాశివ - మహేశ్వర రూపమున మూఁడు భేదములు. శివతత్వమొక్క విధము. సదాశివ తత్వమయిదు విధములు. మహేశ్వర తత్వ మిరువదియైదు విధములు. ఈతత్వము లన్నియుఁ గలిసి ముప్పదియొకటి.

ఆతత్వముల యొక్క భేదములను మొదటఁ జెప్పెదను. ఈశివతత్వము - శివుఁడనియు

తథాచోక్తం వాతులాగమే । సువ్యాఖ్యాతంత్రే । ప్రథమం శివ తత్త్వస్య తత్త్వభేదం వదామ్యహం । తత్తత్త్వం త్రివిధం జ్ఞేయం తస్య భేదం చ శృణ్వథ । శివం సదాశివం చైవ మహేశం త్రివిధం స్మృతం । శివతత్త్వం మహేశాన నిష్కళం చేతి కీర్తితం ॥ సకళం నిష్కళం చైవ సదాశివ మిహోచ్యతే । మహేశం సకలం విద్యాత్ త్రివిధం తద్భవేత్తథా । శివ మేకం విజానీయాత్ । త్రాణాఖ్యం పంచధా భవేత్ । మహేశస్తు మహాసేన పంచ వింశతిభేదకః । ఏతేషాం తత్త్వ సంయుక్త మేకత్రింశదితి స్మృతం ॥

* శివతత్త్వ స్వరూపము. *

తత్రాదౌ నిష్కళ శివతత్త్వ మేవోక్తం । తస్య దశనామాని తత్ప్రవృత్తి నిమిత్తాని తత్త్వేన విస్తరాత్ । తథాహి । శివస్య లక్షణం వక్ష్యే । సమాసాచ్ఛృణు షణ్ముఖ । శివం పరాత్పరం సూక్ష్మం । నిత్యం సర్వగతావ్యయం ॥ అనిందిత మనౌపమ్యం । అప్రమాణ మనా

---

సదాశివుఁడని యు, మహేశ్వరుఁడని యు, మూడు విధములు. వీనిలో శివతత్త్వము నిష్కళ మనియు, సదాశివతత్త్వము సకలనిష్కళ మనియు, మహేశతత్త్వము సకల మనియు చెప్పఁబడును. శివతత్త్వ మొక విధమును, సదా శివతత్త్వ మయిదు విధములును, మహేశ్వర తత్త్వమిరువది యైదు విధములును నగును. అన్నియుఁ గలిసి ముప్పది యొకటి అని యాగమములం జెప్పఁబడి ది.

* శివతత్త్వస్వరూపము. *

మొదట, నిష్కళ శివతత్త్వమునకుఁ బదినామములు గలవని యాగామములను వాని సార్థక్యము నందే చెప్పఁ బడినది.

కుమారా! శివలక్షణము వచించెద. శివుండు పరాత్పరుఁడు, నిత్యుఁడు, సర్వవ్యాపి, నాశనములేని వాఁడు, నిత్యుఁడు ప్రమాణాతీతుఁడు, పరాత్పరుఁడు, నిర్గుణుఁడు. నిష్కళుఁడు, నిర్మలుఁడు, నిర్దోషుఁడు ననంబడును. అతఁడే శివతత్త్వము.

ఆవాహనాదుల సంప్రాప్తి లేక యత్యంత పరిశుద్ధుఁడగు వాఁడే శివుండనఁ బడు

మహం । శుద్ధత్వా చ్ఛివ ముద్దిష్టః పరాదూర్ధ్వం పరాత్పరః ॥ వ్యోమాతీతంతు సూక్ష్మంహి । నిత్యం కారణ కారణం । వ్యాప్తం సర్వగతం ప్రోక్తం । అక్షీణం చావ్యయం భవేత్ ॥ అమలా నిందితం జ్ఞేయ । మహాత్మ్యశ్చ మనౌపమం । ప్రమాణ వ్యతిరిక్తత్వా దప్రమాణమితిస్మృతం। నిర్గుణత్వాద్విశేషేణ చానామయ మితిస్మృతం । ఇత్యేతైర్లక్షణైర్యుక్తం । శివరూప మిహోదిత మితి ॥

అపిచ॥ వాయవ్యసంహితాయాం ॥ అనాది మల సంశ్లేష ప్రాగభావా త్స్వభావతః । అత్యంత పరిశుద్ధత్వా । దతోయం శివ ఉచ్యతే ॥ అథవా శేషకల్యాణ గుణైకాయతన మీశ్వరః । శివ ఇత్యుచ్యతే సద్భిః । శివతత్వార్థ వేదిభిః ॥

మహా భారతేపి॥ సమేధయతి యన్నిత్యః సర్వార్థాన్ సర్వకర్మసు శివమిచ్ఛన్మనుష్యాణాం । తస్మాదేవ శివస్మృతః॥

అథర్వణ శిఖాయాం॥ శివ ఏకో ధ్యేయః శివం కరః సర్వ మన్యత్పరిత్యజ్యేత ॥ తథా ప్రధాంతరే ॥ అఖండావరణం పాశం । నిఖిలేశ నిజాత్మనాం । ఏకఏవ పరంనాస్తి । తద్వ త్సూత్రేప్యుదాహృతం॥

---

సు: యతీశ్వరు శివతత్వమును గుర్తెఱిగిన వారలు— సమస్త కల్యాణగుణములకు స్థానమైన వాడుగనుక శివుండని పిలువఁబడు చున్నాఁడని పలికిరి. అనిహాము వాయుసంహిత యందుఁ గలదు.

సర్వ కర్మల యందు మనుష్యుల శ్రేయస్సును గోరుచు, సర్వార్థములను నే కారణమున శివుంతు వృద్ధినొందించు చున్నాఁడో, ఆకారణమున నాతఁడు శివుఁడని నుడువఁబడు చున్నాఁడని మహాభారతమునఁ గలదు.

ఇతరమైనది సర్వమును విడిచి శివంకరుఁడగు శివుఁడొకఁడే ధ్యానముచేయఁ దగినవాఁడని యథర్వణ వేదము చెప్పుచున్నది.

ప్రత్యేకముగ నాత్మల కన్నిటికి నావరణ స్వరూపుఁడై శివుండొక్కఁడే గలఁడని సూత్రము నందుదహరింపఁ బడినది.

న దేహో నేంద్రియః ప్రాణో మనో బుద్ధి రహంకృతిః । న చిత్త మాకాశో వాచ్ఛ్వం. న చ వ్యోమాదికం జగత్ ॥ నాహో న రాత్రి ర్న నభో న భూమిః । నాన్ధకారో మో జ్యోతిరభూన్న చాన్యత్ । శ్రోత్రాది బుద్ధ్యా ద్యనుపలభ్య మేకం ప్రాధానకం బ్రహ్మపుమాన్ ప్రతీతః॥

తథా శివరహస్యే ॥ మహాలింగ మిదం దేవి । మనోతీత మగోచరం। నిర్నామ నిర్గుణం నిత్యం నిరామయ నిరంజనం । నిర్మలం నిష్కళం జ్ఞేయం । నిర్భేద్యం నిరుపాధికం । అద్వైతానంద మక్షీణ మస్పృశ్య మిదం శృణు । అలక్ష్య మద్వయం శూన్య మమూర్తం పరమవ్యయం। అకులా నామయం శుద్ధ । మనాద్యం శివముచ్యతే । ఊర్ధ్వంశూన్య మథ శూన్యం మధ్య శూన్య స్వరూపకం । ఆది మధ్యాంతశూన్యంచ నిష్కళం దేహవర్జితం ॥

అపిచ॥ ఆదిమధ్యాంత శూన్యంచ । వ్యోమావ్యోమ వివర్జితం. ధ్యాన జ్ఞాన విధాహీనం శూన్యం లింగ మనాశ్రయం । అంత శ్శూన్యం బహి శ్శూన్యం శూన్యం నూనం దశోదశ । సర్వశూన్యం నిరా

---

దేహము- ఇంద్రియములు- ప్రాణము-మనోబుద్ధ్యహంకారములు- చిత్తము- ఆకాశాదికము- దివారాత్రులు- భూమి- మొదలగు నవేమియు శివుండుగాను- వీటినన్నిటిని నతిక్రమించి- వాట్యన్నిటికి తీతుండై ప్రకాశించు పురుషుండే బ్రహ్మయనం బడునని గ్రంథాంతరమున గలదు.

ఓపార్వతీ మనోతీతమై యగమ్యమైన మహాలింగము నిర్గుణమై నామరహితమై నిరంజనమై నిర్మలమై యాద్యంతరహితమై యనుపమానమై వెలయు చున్నది. మఱియు మహాలింగము దేహరహితమై యాదిమధ్యాంత శూన్యమై ప్రకాశించు చున్నది.

అంతశ్శూన్యము- బహిశ్శూన్యము- అక్షయరహితము - పరమపదము సర్వాభీష్టప్రదము- నగు విలసిల్లు చున్నదా మహాలింగము.

ఇచ్చట శూన్యశబ్దమునకు- గగనకుసుమము- శశవిషాణము- అను పదములతో సమానార్థము గలదు. స్థితిని మాత్రమే శబ్దము సూచించును.

శించ సర్వనరి పరమారి పదు ॥ అత్ర ॥ శూన్య శబ్దో గగన కుసుమాశ
శవిషాణా పరపర్యాయో భవతి ॥

కింతు॥ సత్తామాత్రోప లక్షణం॥ శూన్య శబ్దస్య నిర్వచన ము
ప్యుక్తం ॥ వతూలే ॥ వాఙ్మనోతీత భావత్వా । చ్ఛూన్యం చేతి ప్రకీ
ర్తితం ॥

తథా ప్రదేశాంతరే ॥ వాచాతీతంమనోతీతం భావాతీతం పర
శ్శివః । సర్వశూన్యం నిరాకాశం । పరమానంద ఉచ్యతే ॥ సచ్చిత్సు
ఖా ద్వయానందం నిత్య మేకం నిరంజనం । ఉపదేష్టా జగత్సాక్షీ నని
ర్దేశ్య మితి స్మృతం ॥ సర్వేషాం స్థాన భూతత్వాత్ । లయభూతత్వత
స్తథా । తత్వానాం మహదాదీనాం । స్థల మిత్యభిధీయతే । నబ్రహ్మా
నహరి ర్నేంద్రో । నసూర్యో ననిశాకరః । నదిశో నచభూమిశ్చ । నచ
సర్వేచ సువ్రత । నరుద్రో నచవాకాలో నేశ్వరో నతమస్తథా । అ
నాఖ్యంచ నిరాభావం సంస్థితం తన్నిరాశ్రయం । అలక్ష మద్వయం

---

శూన్యశబ్దార్థము వాతూలమున నిటులఁ జెప్పబడినది. వాఙ్మనోతీత భావము గల
ది యగుట వలన మహాలింగమునకు శూన్యమని నామము.

పరశివుఁడు వాక్కులకందనివాఁడు మనస్సునకగోచరమైన వాఁడు భావము
నకతీతమైనవాఁడు. సచ్చిదానంద స్వరూపుఁడు. జగత్సాక్షి. ఇట్టివాఁడని యీపరశివుని ని
రూపింప శక్తిగల వారులేరు.

మహదాది సర్వతత్వములకు స్థానమగుట వలనను- లయస్థానమగుట వలనను న
తఁడు స్థలమని పేర్కొనఁబడుచున్నాఁడు.

ఆశివతత్వము. బ్రహ్మవిష్ణురుద్రులకతీతము. సూర్యచంద్రులు. తమస్సు మొదలగు
వన్నిటికంటె వేరైనది

పేరులేనిది, భావమున కందనిది. ఏకము- అమూర్తము, నశించనిది. యని మరొక
చోట వచింపఁ బడినది.

ఆకాశాది జగత్సాక్షియై యాకాశ జనితములగు వాటికంటెఁ బరుఁడై మనోవా

శూన్యమమూర్తం పరమవ్యయం । అకులానామయం శుద్ధమనాద్యాం శివముచ్యతే ॥

అపిచ ॥ నబ్రహ్మాచ నవిష్ణుశ్చ । నరుద్రో నోఽపి వ్యోమః । నాగ్నిర్వాయుః సమీరోఽంబు । నభూమిర్నగ్రహాఃపిచ । నతత్త్వ ప్రచయః కాలః శివ ఏకోఽస్తి కేవలః । శివోఽస్తి సాక్షాత్సర్వాత్మా సర్వం జన్స్వభావతః । ఆకాశాది జగత్సాక్షీ ఆకాశాత్స్వభావాత్పరః । శివోఽస్తి సచ్చిదానందః పరిపూర్ణో నిరంజనః । అకారణమకార్యంచ మనోవాచామగోచరః ॥

* పరశివతత్త్వ సాధన నిరూపణం. *

ఏవంవిధం పరశివతత్త్వం కథం సాధ్యం భవతీత్యాశంకాయాం తస్య సాధనాని మతంగ పారమేశ్వర సూత్రేణ దర్శ్యంతే ॥

సూ॥ ధర్మేణ సాధ్యతే ధర్మీ క్వచిత్కార్యేణ కారణం । కారణేనక్వచిత్కార్యం క్వచిదామ్నాయ దర్శనాత్ ॥

అస్యార్థః ॥ ధర్మేణ జ్ఞానక్రియా లక్షణేన ధర్మీ జ్ఞేయవస్తు సాధ్యతే । యథా సుగంధాదినా ధర్మేణ అత్యంతగంధ కారయ

---

గతీతుఁడై పరిపూర్ణుఁడై సచ్చిదానంద స్వరూపుఁడై శివుఁడొకఁడే గలఁడు. బ్రహ్మలేడు, విష్ణువులేడు. రుద్రుఁడు లేఁడు - సూర్యచంద్రులులేరు. పంచభూతములు లేవు. నక్షత్రములులేవు గ్రహములు లేవు అని వేరొక చోట చెప్పఁబడినది.

* పరశివతత్త్వ సాధన నిరూపణము. *

ఆ యట్టి పరశివతత్త్వము నెట్లు సాధింపవలయునో ఆవిషయమును మతంగ పారమేశ్వర సూత్రముచే నిరూపించుచున్నాఁడు.

ఒకచోట, ధర్మజ్ఞానముచేత ధర్మిసాధింపఁ బడుచున్నది. ఎట్లనఁగ - చీకటియం దున్నయుండు కర్పూరాది సుగంధి ద్రవ్యముగలదా, అదియునకుఁ గన్పింపకున్నను పరిమళమును బట్టి కర్పూరాదికము గ్రహింపఁ బడుచున్నది.

వేరొకచోట, కార్యముచేత కారణము సాధింపఁ బడుచున్నది. ఎట్లనఁగా:- పృథివ్యాది కార్యమును బట్టి తదుపాదాన కారణమగు మాయాదికమును, నిమిత్త కారణము

ధ్వపర్తి కర్పూర కస్తూరి కాది ధర్మి సాధ్యతే॥ సామాన్యతో దృ ష్టానుమానం అనుభయాత్మ కానుమానం॥ ఏతత్ । క్వచిత్తన్మాత్ర ప్ర కరణాదిషు పృథివ్యాది కార్యేణ తన్మాత్రాది మాయాంతాది ఉపదా న కారణం నిమిత్తకారణం పరమేశ్వరశ్చ సాధ్యతే। ధూమాది కార ణేన వహ్న్యుద్యుపాదాన కారణ మివ, దేహ ప్రవర్తనాది కార్యేణ నిమిత్త కారణ మాత్మేవ ఏతత్ కార్యం లింగకానుమానం క్వచి ద్భో గ పదార్థ ప్రకరణాదిషు కారణేన సుకృత దుష్కృతానుష్ఠాన దీక్షాది క్రిత సమాయా ద్యుపాయాచరణ కారణేన, కార్యం ఆముష్మిక సుఖ దుఃఖ రూప భోగ సిద్ధ మోక్షరూప కార్యం సాధ్యతే॥ వర్షకాలె ని ఘ్నరహిత మేఘోన్నతి కారణేన వృష్టి రూపకార్యం యథా తథైవ సాధ్యతే॥ ఏతత్కారణ లింగకానుమానం॥ ఏత త్త్రి విధానుమానై ర్గో చరో నయది స్యాత్ క్వచి త్తథా ఆమ్నాయ దర్శనాత్ । ఆగమజ్ఞా నేన సాధ్యతే॥ ఏత చ్చతుర్విధ ప్రమాణై ర్నాస యతుం నశక్యతె ఇతి తత్పతి లక్షణం పిశ్వసారోత్తర సూత్రేణ దర్శ్యతి॥

* పతిలక్షణం *

శ్లో॥ అచేతనస్య మాయాదేః ప్రవర్తితయా పతిః। సిద్ధస్సార్వార్థ ౧

---

గు పరమేశ్వరుఁడును సాధింపఁబడును.

మరొకచోట, కారణముచేత కార్యము సాధింపఁబడును. ఎట్లనఁ- వానయొక్క విఘ్నములు లేనందు, గాఢముగ నాకసమున నలమికొనిన మేఘములరూప కారణమును బట్టి వృష్టిరూప కార్యము సాధింపఁబడును.

ఈయనుమానత్రయమున సాధింపఁబడని యపుడు- నాల్గవదియగు నాగమ ప్రమాణమున సాధింపఁబడును.

ప్రమాణ చతుష్టయము చేతను, బరమశివుఁడు సాధింపఁబడునటుల సమర్థుఁడు గాఁడని విశ్వసారోత్తర సూత్రమున నిరూపించు చున్నాఁడు.

* పతి లక్షణము . *

తా॥ సమస్త పదార్థములను గుర్తెరిగి సర్వవ్యాపకుఁడై సర్వజ్ఞుఁడైన పరమే

త్కర్తా వ్యాపక స్సతతోదితః॥

వ్యా॥ సర్వార్థ విత్॥ ఉపాదాన సహకారి కార్యోపకార్య ప్రయోజనాది సమస్త పదార్థజ్ఞః। కర్తా సర్వస్య కర్తా వ్యాపకః సర్వగః॥ స్వతతోదితః। నిత్యముక్తః పరమేశ్వరః॥ పతిః। అచేతనస్య జడస్య మాయాదేః పృథివ్యాది జగత్కార్యోపాదాన కారణస్య ప్రవర్తకతయా ప్రేరకతయా సిద్ధః సాధ్య వ్యతిరిక్తః। ఇతి శ్లో కార్థః।

అద్వైతవస్తు నోపర్లక్ష్య నిర్గుణ పరాలంబ నిరుపాధిక నిర్మలత్వాది ప్రతిపాదితం। అస్య జీవ మాయాద్యచేతన ప్రవర్తక లక్షణం త్వయుక్తం తత్కథమేతదుపపద్యత ఇత్యాశంక్య యథా ఆత్మా శరీరం ప్రేరణాదికం కరోతి। తథా శివః అశరీరస్సన్ బిందుక్షోభా ద్యశేష కార్యం కరోతి। తత్ర దృష్టాంత పూర్వకం కిరణసూత్రేణ దర్శయతి॥

* నిరాకారస్య జగత్కారణతా నిరూపణం *

శ్లో॥ యథా కాలో హ్యమూర్తోపి దృశ్యతే ఫలసాధకః। తథా శి

---

శ్వరుడు పృథివ్యాది జగత్కార్యములకు - ఉపాదాన కారణమును బ్రవర్తింపజేయు వాఁడగుట చేత స్వతస్సిద్ధుఁడే గని, సాధ్యుఁగాఁడు.

నిరుపాధికుఁడు- నిరాలంబుఁడు- నిర్గుణుఁడు- పశుపతి యనుచు నిరూపింపఁబడెను. నిరాకారుఁడగు నీపశుపతికి జీవమాయాద్యచేతన ప్రవర్తకుఁడని లక్షణము చెప్పఁబడెను. ఇది యెటుల కుదురునని శంకింప వలదు.

ఆ ప్రకారిగా,ఆత్మ శరీరములో నుండి సమస్త పనులను శరీరిచేఁజేయించు చున్నదో, అటులే శివుండు, శరీరము లేని వాఁడయి బిందుక్షోభాది సర్వ కార్యములను జేయుచుండునని సోదాహరణముగాఁగిరణ సూత్రమున నన్వరచు చున్నాఁడు.

* నిరాకారునికి జగత్కారణత్వము నిరూపించుట . *

తా॥ శరీరము లేకున్నను కాలమెట్లు ఫలములను సృజించు చున్నదో, అట్లు దేహము లేకున్నను శివుఁడు, ఇచ్ఛాశక్తిచేత బిందు క్షోభాది కార్యమును జేయుచున్నాఁడు.

వాహ్యాయమూర్తోపి కురుతే కార్యమిచ్ఛయా ॥

కాలః అమూర్తోపి దేహ రహితోపి యథా ఫలసాధకస్సన్ దృశ్యతేహి ప్రసిద్ధః । తథా శివః అమూర్తోపి ఇచ్ఛయా ఇచ్ఛాశక్త్యా కరణేన కార్యం బిందుక్షోభాది కార్యం కురుతే ఇత్యర్థః ॥

వాతులాగమే శుద్ధాఖ్యతంత్రే । సృష్ట్యర్థం సర్వతత్వానాం లోకస్యోత్పత్తి కారణం । యోగినా ముపకారాయ స్వేచ్ఛయా చింత్యతే శివః । లోకస్య సమస్తస్య ఉత్పత్తి కారణం ఉదయ కారణం శివ ॥ శివతత్వ ॥ శివ మితి తత్వస్యాభిధానం । అతః పున్నామకస్య తత్వస్య దాసీ దిత్యాశంక్య తయోః పున్నపుంసకయో రేకార్థత్వ దృష్టాంతః అథర్వణవేదే శ్రూయతే ॥

శుద్ధి ఓంతత్పరం బ్రహ్మ సవకో రుద్రః స ఈశాన స్సభగవాన్ స మహేశ్వరః సమహాదేవ ఇతి ॥

సర్వతత్వానాం సృష్ట్యర్థం యోగినాం శుద్ధాధ్వవర్తినాం ఉపకారాయ స్వేచ్ఛయా స్వేన స్వయం చింత్యతే ॥

---

అథర్వణ వేదమున శివశబ్దము, పుంలింగమందు,గలదు. తత్వవాచకమైనప్పుడుమాత్రము శివ శబ్దము నపుంసక లింగము. శివుండు మహాదేవుండు. అట్టి పరశివుండు సకల తత్వముల సృష్టికొరకును - లోకోత్పత్తి కొఱకును, శుద్ధాధ్వ యందుండిన యోగి జనుల యుపకారము కొఱకును దనయిచ్ఛచే స్వయముగా జింతించును.

అపరమేశ్వరుని సహస్రాంశము వలన చింతాపరాశక్తి జనించెను. పరాశక్తి సహస్రాంశము వలన ఆదిశక్తి జనించెను. ఆదిశక్తి సహస్రాంశము వలన యిచ్ఛాశక్తియు, తత్సహస్రాంశము వలన- జ్ఞానశక్తియు, తత్సహస్రాంశము వలన క్రియాశక్తియు నుత్పన్నములయ్యెను.

ఈశక్తులన్నియు నిష్కళ స్వరూపమునుండి వచ్చిన వగుట చేతను, కళారాహిత్యము వలనను నిష్కళశక్తులని వచింపఁ బడుచున్నవి,

తస్య చింతా పరాశక్తి స్సహస్రాంశేన జాయతే। తచ్ఛక్తి స్సహస్రాంశా దాదిశక్తి స్సముద్భవః॥

తస్య పరమేశ్వరస్య సహస్రాంశేన చింతా పరా శక్తి ర్జాతా। తచ్ఛక్తి సహస్రాంశా దాది శక్తి రుత్పన్నా। తచ్ఛక్తి సహస్రాంశాత్ పరాశక్తిః ఆదిశక్తిః ఇచ్ఛాశక్తిః, జ్ఞానశక్తిః, క్రియాశక్తిశ్చ పంచధా పరిస్ఫురద్భావా నిష్కళత్వా చ్చేతాః శక్తయో నిష్కళా ఇతి కీర్తితాః। తాసాం మధ్యే సృష్ట్యాది క్రియాభేదేన ఇచ్ఛాశక్తిః క్రియాశక్త్య నుగ్రాహకరూపేణ జ్ఞానశక్తి రితి మృగేంద్రసూత్రేణ దర్శయతి॥

శ్లో॥ కరణంచ నశక్త్యన్యత్ । శక్తి ర్నా చేతనాచితః । విషయా నియమా దేకం భోక్తృత్వేచ తత్తథాకరణంచ ॥

శక్తేరన్యత్ కరణం నాస్తి చిద్రూపస్య పరమేశ్వరస్య శక్తిః । అచేతనా । అచిద్రూపా సఏకం తత్ శక్తిరూప కరణం విషయానియమాత్ । విషయతో జ్ఞేయ కరణేషు రూపయోః అనియమాత్ అనంతత్వాత్ భోక్తౄణాం విషయకృత్యేచ కార్యవిషయే తథా అనంతా శక్తి ఇతి శక్తే రేకో వర్తతే ।

---

ఈశక్తి పంచకములో సృష్ట్యాది క్రియా భేదమున, ఇచ్ఛాశక్తి క్రియాశక్తులు రెండును జనించినవి. తదనుగ్రహరూపమున జ్ఞానశక్తి కలిగినది. అని మృగేంద్ర సూత్రముచే నిరూపించు చున్నారు.

శక్తికంటె వేరైన సాధనము లేదు. చిదచిద్రూపుడగు పరమేశ్వరుని శక్తియు చేతనమైనది. ఆశక్తి రూపకరణము. చేయదగినవి తెలిసికొనదగినవి విషయము లనేకములగుటవలన జ్ఞానశక్తియనియు, క్రియాశక్తి యనియు, మొదలగు నామములు గలిగియున్నది.

"అనంతా శక్తిః" అను శ్రుతి వలనను శక్తిభేదము గలదని తెలియుచు న్నది.

* ఈశ్వరశక్తే రనాదితా నిరూపణం *

తచ్ఛక్తిః, అనాదిర్వా ఆగంతుకీవే త్యాశంక్య అనాది రీశ్వర సంబంధినీ శక్తిరితి విశ్వసారోత్తర సూత్రేణ దర్శయతి ॥

శ్లో॥ దృక్క్రియాత్మక మైశ్వర్యం యస్య తద్ధాత్మ పూర్వకం।
ఈశ్వర స్సోత్ర మంతవ్యః శక్తిద్వయ యుత ప్రభుః ॥

దృక్క్రియాత్మకం సర్వ విషయ జ్ఞాన క్రియా స్వరూపం యస్య తదైశ్వర్యం ఈశ్వరత్వం తత్ । అధాత్మపూర్వకం కారణ రహితమిత్యర్థః। ప్రభుః స్వతంత్ర కర్తా॥ శక్తి ద్వయ యుతః దృక్క్రియా శక్తి ద్వయ యుతః సః పరమేశ్వరః అత్ర శివాగమే మంతవ్యః యుక్తిభి రను చింతనీయః యుక్తిభి రనుచింతనంమనన మిత్యుక్తత్వాత్॥ తదుక్తం। శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యో మంతవ్యశ్చోప పత్తిభిః। ఆత్మా చ సతతం ధ్యేయ ఏతే దర్శన హేతవ ఇతి ॥

* ఈశ్వర శక్తి యనాదియని నిర్ణయించుట. *

అ॥ ఆశక్తి మధ్యవచ్చినదా? లేక యనాది నుండి యున్నదా! అని ప్రశ్నించుకొని, ఈశ్వర సంబంధమగు శక్తి యనాది నుండి వచ్చినది యేగాని, మధ్యవచ్చినది గాదని విశ్వసారోత్తర సూత్రమున నిరూపించుచున్నాడు.

తా॥ సర్వవిషయము లందు జ్ఞానక్రియా శక్తి ద్వయముతోఁ గూడికొని, తనకు గారణభూతుఁడు లేని వాఁడై స్వతంత్రుఁడైన సర్వేశ్వరుఁడు శివాగమాది ప్రతిపాదితములగు యుక్తులచే మననము చేయఁదగిన వాఁడు.

వేదవాక్యములను విని యిందు జెప్పఁబడిన యుక్తులచే మననము చేసి పరమేశ్వరుని ధ్యానింప వలయునని శివాగమము చెప్పఁగలదు. పుష్పమును విడిచి పరిమళమును- పరిమళమును విడిచి పుష్పమును- ఆకాశమును వదిలి వాయువును వాయువును వదిలి యాకాశమును నెటుల నుండవో; అటులనే శివునివిడిచి శక్తియు, శక్తినివిడిచి శివుఁడును యుండ నేరరు.

ప్ర॥ ఈశ్వరుని కనాది శక్తి సంబంధము గలదు గదా?

న శివేన వినా శక్తి ర్నశక్తి రహిత శ్శివః। నపుష్పేణ వినాగంధో నాంబరేణేవ మారుతః॥

అనాదిశక్తి సంబంధి చేదీశ్వర స్తస్య నిష్కళత్వ ప్రతిపాదనం కథం సంభవతీత్యాశంక్యాహ। శక్తిభేదాత్। యథా రాజ్ఞాం భుజశక్తిః బలినాం బలశక్తిః। గజానాం గజశక్తిః తథైవ ఈశ్వరస్యాప్యయమేవ శక్తి మార్గో భవతి॥

స్వశక్తి క్షోభమాత్రేణ సృష్టి లీలాభిముఖేన శివేన ప్రేరితా పరాశక్తిః కార్యాణి యోజయతి। సైవ లీలాంతే తత్రైవ లీనా భవతీత్యుక్తం॥

* సకల నిష్కళ రూప ప్రవచనం. *

శ్లో॥ లీలయా సహిత స్సాక్షా దుమాపతి రితి స్మృతః। లీలయా రహితః పశ్చా త్స్వయంభూ రితి కథ్యతే। తస్య శివస్య పరాశక్తి యోగేన నిష్కళ పరశివ ఏవ ఆత్మానుగ్రహ కారణేన సకళ నిష్కళో భవతి తస్యోదాహరణ మాహ॥

---

ఉ॥ ఆ. ఉన్నది.

ప్ర॥ శక్తితోఁ గూడికొని యున్నప్పుడు శివుని నిష్కళుఁడని యెట్లు చెప్పఁదగు.

ఉ॥ సందేహమేమి. శక్తులనేకములున్నవి. శక్తిభేదము వలన నట్లుఁ జెప్పఁదగును. రాజులకు భుజశక్తియు- బలవంతులకు బలశక్తియు- గజములకు గజశక్తియు నాతుల స్వతస్సిద్ధముగా నున్నదో, అటులనే యీశ్వరునికి గూడ స్వతస్సిద్ధమైన శక్తి గలదు. తన శక్తి చలనము గలిగిన వెంటనే సృష్టిలీలాభిముఖుఁడైన శివునిచే పరాశక్తి ప్రేరేపింపఁబడి సర్వ కార్యములను జేయును. ఎపుడా మహాత్ముని లీల యంతమగునో, అపుడాతని యందది లీనమైయుండును.

* సకల నిష్కళ రూపమును జెప్పుట *

లీలతోఁ గూడినపుడా శివుఁ డుమాపతియని పిలువఁబడును. లీలా రహితుఁడైనపుడు స్వయంభుఁడని వచింపఁబడును.

నిష్కళుఁడగు నాపరశివుఁడే జీవానుగ్రహ కారణమున సకల నిష్కళుఁడై యగుచున్నాఁడు. ఈవిషయమున గ్రంథాంతరోదాహరణమును జూపించుచున్నాఁడు.

శ్లో॥ చిద చిదనుగ్రహ హేతోః రూపాణ్యేతాని స ప్రభుః కృత్వా। కురుతే చితా మనుగ్రహ మనాది మల రుద్ధ శక్తీనాం॥ స ప్రభుః పరమేశ్వరః చితాం చానుగ్రహార్థ మేతాని రూపాణి సదాశివాద్యాకారాణ్ కృత్వా ప్రాస్య అనాది మలరుద్ధశక్తీనా అనాదిమల రుద్ధ సామర్థ్యానాం జీవా మాత్మనామనుగ్రహం మోక్షరూపం కురుతే తథా॥ వాతూలతంత్రే॥ యోగినాంచ యతీనాంచ జ్ఞానినాం మాంత్రిణాం తథా। ధ్యాన పూజా నిమిత్తాయ సకళం నిష్కళం భవేత్॥ తస్య లక్షణాని దర్శయతి॥

శ్లో॥ అదృశ్యే భావనా నాస్తి దృశ్య మేతద్వినశ్యతి। దృశ్యాదృశ్య స్వభావంచ సారూప్య స్యావలోకనాత్। అస్తి నాస్తి ద్వయాతీత మస్తి నాస్తి సమన్వితం। సర్వజ్ఞ సర్వ రహితం తత్పదం విద్ధి షణ్ముఖ।

---

పరమేశ్వరుఁడే జ్ఞానుల ననుగ్రహించుటకై సదాశివుఁడు మొదలుగాఁగల రూపములఁ దాల్చి యనాది మలసంయోగముచే నిరోధింపఁబడిన స్వసామర్థ్యముగల జీవుల ననుగ్రహించి మోక్షము నొసఁగు చున్నాఁడు.

శివయోగులకు - యతులకు - జ్ఞానులకు - మాంత్రికులకు - ధ్యానించుటకును - బూజఁ జేయుటకును, అనుకూలముగా నుండునటుల శివుండు సకల నిష్కళ రూపములఁ ధరించు చున్నాఁడని వాతూలాగమమున గలదు.

అదృశ్యము నందు భావనయే లేదు. అట్టిది దృశ్యము నశించు గలదు. దృశ్యత యంతయు నశించునది శివ సారూప్యమును నవలోకించుచున్న దృశ్యాదృశ్య భావన గలుగును. "అస్తి నాస్తి" యనుమాటల కందనిదియు, "అస్తి నాస్తి" యను వానితో గూడుకొనినది యగు స్థానమునే సర్వరహితమైనదిగా నో కుమార! తెలిసి కొనుము.

అదియే యనిర్వాచ్యమైనది. స్వలీలా నందమునకు హేతువైనది. అదియే నాస్వరూపము. నే నేస్వయంభువుఁడను. నాయంతట నేనే లోకసృష్టికై రూపద్వయమును గూడ వహింతును.

షయ జ్ఞానైశ్వర్యాదిభిర్దీప్తిభి రత్యంతం మానః ఆత్మా స్వభావో య స్య సః పాతంజలాది సిద్ధేశ్వర వత్ బుధ్యాది సంయోగేన జ్ఞానాదిదీప్తియుక్తో నభవతి కింతు సర్వ విషయ జ్ఞానాది స్వభావ ఏవ ॥ తమేవ భాంత మనుభాతి విశ్వం తస్య భాసా సర్వ మిదం విభాతీతి శ్రుతిః ॥

నిష్కలంకః బిందు సదాశివాది తత్వ భేదేన మంత్ర మంత్రేశ్వర భేదేన మాయాది పృథివ్యంత తత్వభేదేన పరిణా మీత్యర్థః॥ అచల మూర్తిమాన్ అచలా చలన రహితా జ్ఞాన క్రియాశక్తి రూప మూర్తి రస్యాస్తీ త్యచలమూర్తిమాన్। అస్మిన్నర్థే శృతిరప్యస్తి ॥ వృక్షఇవస్తబ్ధోదివితిష్ఠ త్యేక ఇతి పత్యుః జ్ఞానేన క్రియాచల రూప మూర్తిత్వ ము క్తం పాంచరాత్రోక్త తాంత్రిక శరీర భౌమ శరీర రూప చల మూర్తి ర్నభవతీత్యర్థః॥

తదుక్తం। నిత్య స్సర్వగత స్థాణు రచలోయం సనాతన ఇతి ॥ త స్య మూర్తిత్వం శక్తిరిత్యు పచారేణ ఉక్తంభవతి పృథగేవ మూర్తి రి నేశ భవతీతి తత్సూత్రేణ దర్శయతి॥

శ్లో॥ కాష్ఠానైవ పరా సూక్ష్మా। సర్వదిక్కామృతాత్మికా, ప్రధ్వస్తావ రణా శాంతా వస్తుమాత్రాతిలాలసా॥ ఆద్యంతో పరతా సాధ్వీ మూర్తి త్వే నోపచర్యతే॥

పరా సర్వోత్కృష్టా కాష్ఠాసర్వ జ్ఞాన క్రియారూప స్థితియుక్తా సూక్ష్మా పరమాణ్వాది జ్యోతి స్సూక్ష్మా సర్వదిక్కా వ్యాపికాలనేన పద

---

గూడినందువన జ్ఞానాది ప్రకాశముగలవాఁడు గాక స్వతస్సిద్ధప్రకాశముగలవాఁడు. అఖండమై ప్రకాశించుచున్న యాపరంజ్యోతి దీప్తి వలననే యీ ప్రపంచము ప్రకాశించు చున్నదని శ్రుతిచెప్పుచున్నది.

బిందు సదాశివతత్వ రూపముగను, మంత్ర మంత్రేశ్వర రూపముగను, మాయ మొదలు పృథివి వరకు నుండు తత్వ రూపముగను, నాతఁడు పరిణమించును.

చలనములేని జ్ఞాన క్రియాశక్తి రూపము గలవాఁడు-సనాతనుఁడు-నిత్యుఁడు- స

ద్వయేన వికారీశ్వరవాదినః పాంచరాత్రాః ఈశ్వర మూర్తిస్థాం రూ-
పా అవ్యాపి కేతిచ వదంతి తే నిరస్తాః। అస్మితాత్మికానిత్యా అనేన
అహంకారాత్మ వాదినో మీమాంసకా నిరస్తాః॥

ప్రధ్వస్తా వరణా ధ్వస్తానాది మలసంబంధా అనుగ్రహ తిరోభా-
వాఖ్య స్వకృత్య ద్వయ విధానేపి పాశాదిక సంసర్గరహితా। స్వాతంత్రే-
తి యావత్। శాంతా రాగ ద్వేషాది రహితా। రాజాదివత్ ఆజ్ఞాపాలనేత-
ద్విలంఘనేచ ఆరాధనే తదభావేచ నైర్ఘృణ్య వైషమ్యే శూన్యేత్యర్థః
వస్తుమాత్రావతి అణుగ వస్తుమాత్రాలయు భోగాధికార మూర్తేః జగ-
తః పరిపాలనే కర్తవ్యే అశీలాలసా అత్యంత వాత్సల్య యుక్తా అద్యం-
తోజ్ఝితా ఉత్పత్తి వినాశరహితా అనేన పదేన ప్రవాహ నిత్యేశ్వర వా-
దినో మీమాంసకైకదేశినో నిరస్తాః॥ సాధ్వీ కరుణా యుక్తా స్వప్రయో-
జనాభావే పరానుజిఘృక్షయా సృష్ట్యాది ప్రవృత్తి హేతు భూతే-
త్యర్థః। సైవ జ్ఞానక్రియా శక్తిరూపా అచల మూర్తిః మూర్తిత్వే నోప-
చర్యతే శరీరత్వేన ఉపచారతః కథ్యత ఇత్యర్థః। ఉపచర్యత ఇత్యనేన
తస్యాః పృథఙ్మూర్తిః నాస్తీత్యుక్తం॥

---

ఈ శ్లోకమందు- అచలుఁడు- స్థాణువు ని యాపరశివుని మూర్తియే శక్తియని యౌపచా-
రికముగాఁ జెప్పఁబడినది.

సర్వోత్కృష్టమును, సర్వజ్ఞాన క్రియా రూపముతోఁ గూడినదియు, పరమాణ్వాది-
కములవలెనతిసూక్ష్మమును, సర్వదిగంతవ్యాపియు, నిత్యమును మలసంబంధములేక స్వతంత్ర-
మైనదియు, రాగద్వేషాది రహితమును, నైర్ఘృణ్య వైషమ్యములు లేనిదియు - అత్యంత
వాత్సల్యముతోఁ గూడినదియు, ఉత్పత్తి నాశములు లేనిదియు, పరుల ననుగ్రహించుట-
కై సృష్ట్యాది ప్రవర్తనములకుఁ గారణ మైనదియు నగు నా యచలమూర్తి ప్రకాశించు-
చున్నది.

ఈశ్వరునికి శరీరము లేనిచో, ఆతఁడు నిర్గుణుఁడు నిరాకారుఁడయినచో, ఆత-
ని ధ్యానించు టెట్లు? పూజించు టెట్లు? అని సందేహ మొంద నవసరము లేదు.

నన్వీశ్వరస్య మూర్త్యభావే విచిత్రవర్ణావయవమూర్తిధ్యాన పూజాదయః కథం సంభవేయుః ఉచ్యతే॥

దృక్క్రియాశక్త్యాత్మక మూర్తి మవలంబ్య ధ్యాన పూజాదయ స్సంభవంతి తదుక్తం మృగేంద్రసూత్రే॥

శ్లో॥ వపుషా భిద్యమానత్వా ద్యద్యత్కృత్యం కరోతిసః। తత్తత్రాస్య తత్కర్తృ వపుషా నుకృతం వపుః॥

స పరమేశ్వరః వపుషః మూర్తే రవిద్యమానత్వాత్ యద్యత్ యాదృశం కృత్యం కార్యం కరోతి అస్య పరమేశ్వరస్య తత్ర తత్ర కృత్యేత త్తత్కర్తృ వపుషా తత్తత్కృత్యాధికార శరీరేణ వపుః శరీరమనుకృతం సమీకృతం॥ అతఏవ॥ స్మృత కాశిన్య తనుర్మూర్తి స్సచ్చిదానంద లక్షణా। శివాదన్యా నచైవాస్తి శివఏవహి సాసదా। అనీల వల్లరీ రూపం। యథా పద్మాక్షు కోటరే। ఆస్తేకమలినీ బీజం తథా దీప్తిరి దృశ్యతే॥

అపిచ॥ నిష్కళం తత్త్వ మిత్యుక్తం। సకళం మూర్తి రుచ్యతే॥ సకలం నిష్కళం చైవ ప్రభావమితి కీర్తితం। శివశ్చ తత్త్వ మిత్యుక్తం

---

ఎటువలె జ్ఞాన క్రియా శక్తి రూపమగు మూర్తిని నాధారము చేసికొని ధ్యానము పూజ మొదలగునవి సంభవించుచున్నవి.

అ॥ ఈవిషయమును మృగేంద్ర సూత్రముచే నిరూపించుచున్నారు.

తా. పరమేశ్వరుఁడు శరీరము గలవాఁడగుటచేత, ఆయా కృత్యములచేత వలసినప్పుడు, ఆయాయిపనులు నిర్వహించుటకను కూలమగు రూపము ధరించుచున్నాఁడు.

కావుననే యీపరశివమూర్తి - సచ్చిదానంద స్వరూపము గలిగి శివునికంటె వేరు కానిదై యగుచు శివాభిన్నమై యుండును.

పద్మబీజమునందు - కమలలత లోటులు గర్భితమై యున్నటో, అటులనే సాక్షీభూతుఁడగు నాపరశివునియందు సర్వము నిమిడియున్నది.

తత్త్వము నిష్కళమనియు - సకలము మూర్తియనియుఁ జెప్పఁబడుచున్నది.

మూర్తి శ్చైవ సదాశివః । తయోర్యోగేన భావేన । తద్రూపం భావ ఉచ్యతే॥ ఏవంవిధ సకల నిష్కళ సదా శివతత్త్వస్య శక్తియోగేన భేదో వర్తత ఇతి దృష్టాంత పూర్వకం దర్శయతి॥

### * సకల నిష్కల సదాశివతత్త్వ భేద నిరూపణం. *

యథా వారి మరుత్పంథా నానాకారో విలోక్యతే । తథా సంకల్పవశతః । చిద్బ్రహ్మ పరిబృంహితం॥ అంకుర దళకుసుమ ఫలాన్యనేకశో కాల యోగతో భాంతి। మూర్తయ ఏవం వివిధాః పరే శివే శక్తియోగతో భాంతి॥ అపిచ॥ తత్త్వం వస్తుత ఏకం శివ సంజ్ఞంచితి శక్తి శత ఖచితం। శక్త్యవ్య పరిభేదాత్ తస్యహి కల్పితో భేదః॥

### పంచసాద నిరూపణం.

తస్యభేదాన్ వక్ష్యామః। వాతూలతంత్రే॥ తద్రూపంహి మహాస్తేన। సాదాఖ్య మితి కీర్తితం। సాదాఖ్యం పంచధా ప్రోక్తం తేషాం లక్షణముచ్యతే॥ ప్రథమం శివసాదాఖ్య మమూర్తం తు ద్వితీయకం ।తృ

---

సకల నిష్కలములు గాంచి ప్రతిభావమని పలుక బడినవి.

శివుండు తత్త్వమనియు, మూర్తి సదాశివుఁ డనియు, నుడువఁబడును. వారియొక్క కూడికచేతను, భావముచేతను, వారిరూపము భావ మనఁబడును.

### సకల నిష్కల సదాశివతత్త్వభేద నిరూపణము.

ఇట్టి సకల నిష్కల స్వరూపముగల సదాశివ తత్త్వము నకు శక్తి యోగము చేత భేదముగలదు. దానిని దృష్టాంత పూర్వకముగానిట్లు చెప్పుచున్నాఁడు. ఉదక మొకటియే వాయుసంయోగమునఁ నానా కారముగ నెట్లుఁ జూడబడుచున్నదో, అట్లనే చిద్బ్రహ్మ సంకల్పము ననుసరించి యనేక విధముల ననేకాకారములతో గోచరించుచుండును.

ఎట్లు కాలయోగము వలన బీజము అంకురించి పల్లవించి పుష్పించి ఫలించి యనేక విధములుగ నగపడుచున్నదో, అట్లనే శివునియందు శక్తియోగము వలన ననేక విధములగు మూర్తులు ప్రకాశించు చుండును.

తీయం మూర్తిసాదాఖ్యం। చతుర్థం కర్తృనామకం। పంచమం కర్మసాదాఖ్యం। పంచసాదాఖ్య ముచ్యతే। తేషామేవ నామాంతరాణి వక్ష్యామః।

సాద నామాంతర నిరూపణం.

శ్లో॥ సదాశివ స్తథేశశ్చ బ్రహ్మా శశ్చేశ్వరః స్మృతః। ఈశాన శ్చేతి పంచైతే తత్ప్రభేదాః ప్రకీర్తితాః। తేషాం పూర్వోక్త నామద్వయ సంయోగం క్రమాదాహ।

సాదతత్త్వ సంయోగః

శివం సదాశివం జ్ఞేయ మమూర్తం చేశ ఉచ్యతే। మూర్తం బ్రహ్మేతి విజ్ఞేయం। కర్తృ చైవేశ్వర స్స్మృతం। కర్మేశాన మితి ప్రోక్తం।

---

వస్తుతః తత్త్వ మొకటియేగాని, యనేకములు లేవు. అది శివసుజ్ఞకలదై బహు విధములైన శక్తిశతములతో గూడికొని యున్నది. అందువలననే భేదము లనేకములు కల్పింపబడినవి.

## పంచసాదనిరూపణము.

ఆభేదములు వాతూలమున నీక్రింది విధముగ నిరూపింపఁ బడినవి.

కుమార! ఆశివతత్త్వ రూపము సాదముని చెప్పఁబడును, ఈసాద మయిదు విధములు. శివసాదము మొదటిది. అమూర్తసాదము రెండవది. మూర్తి సాదము మూడవది. కర్తృసాదము నాల్గవది. కర్మసాదము అయిదవది.

## సాదనామాంతర నిరూపణము.

వీనికే సదాశివుఁడని ఈశుఁడని, బ్రహ్మయని ఈశ్వరుఁడని ఈశానుఁడని నామాంతరములు గలవు.

## సాదతత్త్వ సంయోగము.

ఈరెంటికిని నామముల సంయోగమును వచించెద.

శివసాదము సదాశివుఁడనియు, అమూర్తసాదము ఈశుఁడనియు మూర్తసాదము బ్రహ్మయనియు, కర్తృసాద మీశ్వరుఁడనియు, కర్మసాదము ఈశానుఁడనియుఁ బిలువబడును.

మిత్యేవం ద్వివిధా స్మృతం । పంచసాదాఖ్యతత్వానా ముద్భవోహిపృథక్ పృథక్ । తేషాం వర్ణంచ రూపంచ సమాసాత్ శృణుషణ్ముఖ ।

శివసాదలక్షణం.

పరాశక్త్యుద్భవత్వాచ్చ శుద్ధత్వా చ్ఛివముచ్యతే । ప్రసాదం సూక్ష్మరూపంచ । జ్యోతిరూప మితి స్మృతం । విద్యుద్రూప మివాకాశే । ప్రత్యక్షం సర్వతోముఖం । శివతత్వ మితిప్రోక్తం । తత్వానా మఖిలాలయం । శివసాదాఖ్య మిత్యుక్తం ।

అమూర్త సాద లక్షణం.

అమూర్తంతు తతఃశృణు । అమూర్తత్వాత్కళాహీనం తద్రూపం లింగముద్భవం । సూర్యకోటి ప్రతీకాశం జ్యోతిస్తంభాకృతి స్థితం । తస్యాభ్యంతరగతామూర్తి రమూర్తిత్వా దగోచరం । ఏతద్ద్వై దివ్యలింగంతు మూలస్తంభ మిహోచ్యతే । తస్యలక్షణాని గ్రంథాంతరేణాదన్యయితి ।

---

ఈ పంచసాదముల తత్వముల యుత్పత్తి వేరువేరుగా నిరూపింపఁబడినది. వానివర్ణము రూపమును సంగ్రహముగ వచించెద.

శివసాదము.

పరాశక్తినుండి యుద్భవించుట వలనను, పరిశుద్ధుఁడగుట వలనను, శివుఁడని చెప్పఁబడును.

ఆకాశము నందు మెఱుపుబోలె జ్యోతి రూపమునఁ బ్రకాశించుచు. సూక్ష్మరూపమును ధరించి సర్వతోముఖముగ నుండి ప్రత్యక్ష రూపములిగి సర్వ తత్వములకు నిలయమై శివసాద మను పేరుగలిగి శివతత్వము పేర్కొనఁబడుచుండును.

అమూర్తసాదము.

అమూర్త మగుట వలన కళాహీనమై కోటి సూర్య ప్రతీకాశమై జ్యోతిస్తంభాకారము గలిగి యీయమూర్తసాద ముండును. దాని యంతర్భాగ మైనమూర్తి యమూర్తి యగుటచే దెను వుండును. ఇదియే మూలస్తంభ మనిచెప్పఁబడును. దీనిలక్షణము గ్రంథాంతరమునందిటుఁ జెప్పఁబడినది.

శ్లో. నోదేతి నాస్తతాం యాతి నవృద్ధిం యాతి నక్షయం । స్వభావాద్యాత్యథాన్యాని భాసయేత్సాదనందినా॥ తథా వాతూలతంత్రే॥ లింగాత్సర్వం సముత్పన్నం । లీనం తస్మిన్ ప్రకీర్తితం । అమూర్తమేవ మాఖ్యాతం ॥

సమూర్త పాద లక్షణం.

సమూర్తంతు తతశ్శృణు । ఇచ్ఛాశక్తి గుణత్వాచ్చతత్సామాన్యేతి రుద్రాహ్వృతా । మూర్తిత్వాచ్చ కళాయుక్తం । రూపంచేతి ప్రకీర్తితం । జ్వాలాఖ్యాసదృశ ప్రఖ్యాం దివ్యలింగాకృతిర్భవేత్ । తస్యాలార్ధభాగేతు । ఏకవక్త్రి సమన్వితం । త్రినేత్రిం చారు వదనం సర్వావయవసంయుతం । ఏకమేకాననోపేతం దివ్యలింగాకృతిర్భవేత్ ।

కర్తృ పాద లక్షణం.

అథకర్తృపాదాఖ్య ముచ్యతే। జ్ఞానకర్తృ స్వభావత్వా । త్కర్తృనామేతి కీర్తితం । జ్ఞానం హిశుద్ధ భావత్వాత్ స్ఫాటికాభాస ము

---

ఇది యుదయింపదు. అస్తమింపదు. వృద్ధిని బొందదు. క్షయము నొందదు. రూపము లేకున్నను స్వభావము వల్లనే యితరమైన వాటినన్నిటినిఁ బ్రకాశింపఁజేయును "లింగము నుండియే సర్వ ముత్పన్నమైనది. సర్వము దాని యందే లయము గును - ఇదియే నమూర్త పాదమని" వాతూలమునఁ జెప్పబడినది,

సమూర్త పాదము.

ఈ సమూర్త పాదము- ఇచ్ఛాశక్తి గుణములు గలదగుటవలన మూర్త మనఁబడును. ఎప్పుడు మూర్తి గలదో, అప్పుడు కళా సహితమైనది జ్వాలయను పేరు గలిగినదివ్య లింగాకారము గలిగి ప్రకాశించు చుండును.

అందులో నొకభాగమున నొక్కటియే ముఖము గలిగి, త్రినేత్రములు గలిగిన సర్వావయవములతోఁ గూడికొనియొకటియై దివ్య లింగాకారమున నుండును - ఇది మూర్త పాదము.

కర్తృ పాదము.

స్ఫటిక కాంతితో సదృశమైనది. జ్ఞానము- అట్టి పరిశుద్ధ జ్ఞాన కర్తృత్వముగ

చ్యతే దివ్యలింగం మహాదీర్ఘం । మహాస్థూలత మాశ్వేతం । తస్యమధ్య స్థితో మహేశ్వర స్సర్వకారణం । పంచమూర్ధం చతుర్వక్త్రం నేత్రైర్ద్వాదశభి ర్యుతం। చతురాస్యం చతుర్వర్ణం। వసు శ్రోత్ర సమన్వితం । అష్టహస్తం ద్విపాదంచ । సర్వలక్షణ సంయుతం । శూలం పరశుం ఖడ్గంచ । అభయం దక్షిణకరే । నాగం పాశంచ ఘంటాంచ వరదం వామహస్తకే । సర్వావయవ సంయుక్తం । సర్వాభరణ భూషితం తత్త్వమీశ్వరం ప్రోక్తం కర్తృలింగ మిహోచ్యతే। కర్తృసాదాఖ్యమిత్యుక్తం ॥

కర్మసాద లక్షణం.

కర్మ సాదాఖ్య ముచ్యతే । క్రియా కర్మేతి విజ్ఞేయం తస్మాత్కర్మేతి నామతః లింగపీఠ ప్రకారంచ కర్మసాదాఖ్య లక్షణం । నాదో లింగ మితి జ్ఞేయం బిందుః పీఠ ఉదాహృతః॥ బిందునాదయుతం రూపం లింగాకారము హోచ్యతే।అత్రబిందు రేవ పరాశక్తిః లయభోగాధి కారే

---

లనియబడుచే కర్తృసాద మనబడును. అదిసర్వశ్వేతమై మహాస్థూలమై దివ్య లింగాకారము గలిగి యుండును. అయిదు శిరస్సులు నాలుగు ముఖములు పండ్రెండు నేత్రములు- ఎనిమిది హస్తములు - నాల్గువర్ణములు - రెండు పాదములు గలిగి కుడిచేతియందు శూలము పరశువు - ఖడ్గము అభయమును, ఎడమచేతి యందు నాగము - పాశము - ఘంటము - వరదము - ను గలిగి సర్వావయవములతో గూడికొని, సర్వాభరణములచే నలంకృతమైన ఈశ్వర తత్వమే కర్తృసాద మని పేరొనబడినది.

కర్మసాదము.

క్రియయే కర్మ యని తెలియవలయును. లింగపీఠమై కర్మసాదమని వచింపబడును. నాదము లింగమనియు బిందువు పీఠమనియు నుదాహరించబడినవి. నాదబిందువులతోఁ గూడినదియే లింగాకారము. బిందువే పరాశక్తి. ఇయ్యది లయభోగాధికారమున నిత్య త్రియాత్మకముగా నుండును.

ణ శ్రిత త్త్వాత్మకం । తదేవ కుండలినీ త్త్యభేదో వర్తతే । చత్వారి క
ర్త్రిరూపాది కేవలం నామ ముచ్యతే । తదేవలింగ పీఠ ప్రకారైః కథి
తః॥ లింగం శివ మితిజ్ఞేయం పీఠ శ్శక్తి రుదాహృతః। బిందు మధ్య గ
తో నాదో నాదమధ్యేతు మూర్తయః । మూర్తిమధ్య గతంతత్త్వం ।
తత్త్వమధ్య గత శ్శివః । తత్త్వరూప మిదం లింగం సర్వ తత్త్వాలయం
విదుః॥ లింగేన జాయతే తత్త్వం । జగత్ స్థావరజంగమం॥ తథాచోక్తం
బ్రహ్మాండపురాణే ॥ చరాచరాత్మక మిదం యత్ర విశ్వం విలీయతే ।
ఉత్పద్యంతే యతో భూయ స్తల్లింగం పరమిష్యతే । ఉత్పద్యంతే విన
శ్యంతి స్థితింయాంతిచ తత్రవై ॥

తథాకూర్మ పురాణే॥ సర్వంలింగే విజానీయాత్ । లింగం స
ర్వత్ర సంస్థితం । సర్వతీర్థాని లోకస్య సర్వ యజ్ఞఫలానిచ । యథాచ
ద్యౌశ్చ వాయ్వగ్ని చంద్రాదిత్యా జగత్త్రయం । ఏతేషా ముదయాంతే

---

ఇదియే కుండలినీ శక్తి యని నుడువఁ బడినది. ఈరెంటికి నభేదమే గాని, భే
దము లేదు.

లింగము శివుఁడనియు - పీఠము శక్తియనియుఁ జెప్పఁబడినది బిందు మధ్య
మును బొంది నాదముండును. నాదమధ్యమును బొంది మూర్తు లుండును. మూర్తిమధ్య
మును బొంది తత్త్వ ముండును. తత్త్వ మధ్యమును బొంది శివుఁడుండును.

సర్వ తత్త్వములకు నిలయమైనది లింగస్వరూపము. లింగమునుండియే చరాచరా
త్మక ప్రపంచము జనించు చున్నది.

దేనినుండి యీ చరాచరమగు ప్రపంచము నుత్పత్తి నొందుచున్నదో, ఎందు దిరి
గి లయమును బొందుచున్నదో, దేనివలన పోషించఁ బడుచున్నదో, అదియే లింగమని
బ్రహ్మాండ పురాణమునఁ జెప్పఁ బడినది.

పంచభూతాదులకు గారణమై యద్వితీయమై తెలియు నాలింగమునందే సర్వ
తీర్థములును, సర్వ యజ్ఞ ఫలములును గలవు. పరానంద స్వరూపుఁడై లక్ష్య లక్షణ ర
హితుఁడై యెప్పటికి నవినాశన దైవతమై ప్రకాశించునది లింగమే కాని, మరొకటి లేదు

చఆదిశేత్ ।లింగ మద్వయం। అపిచ। నిత్యః పూర్ణః పరానందో లక్ష్య లక్షణ వర్జితః । సర్వాధిష్ఠాన మేవైత । ల్లింగ మిత్య వధారయ ॥ చరాచరాత్మక మిదం । యత్ర విశ్వంచ లీయతే । ఉత్పద్యంతే యతోభూయ । స్తల్లింగం పర మిష్యతె । లీయతే గమ్యతే యత్ర యేన సర్వం చరాచరం । తదేతల్లింగ మిత్యుక్తం లింగతత్వ పరాయణైః। తస్యకంచ సంజ్ఞా వర్తతే ॥ పరం గూఢం శరీరస్థం లింగం క్షేత్రమ పాదిమత్ । యథాద్యమై శ్వరం తేజ । స్తల్లింగం పంచసంజ్ఞికం ॥ తస్మా ల్లింగ విశేషేణ । కర్మరూప ముదాహృతం । కర్మోదయేచ సృష్టిశ్చ । కర్మాంతే సంహృతి భవేత్ । ఏతత్కర్మ స్వరూపంతు । సృష్టిస్థితిలయా వహం । పంచ సాదాఖ్య మేవోక్తం। కర్మసాదాఖ్య మిత్యపి ।

## సర్వత త్వాశ్రయం శివతత్వమేవ.

అత్ర తత్వానామేకఏవా శ్రయం కథ్యతే । శివ సాదాఖ్య

---

ఎప్పుడు నీ సర్వ ప్రపంచము లీనమగుచున్నదో దేనినుండి తిరిగి యుద్భవించు చున్నదో అదియే లింగము.

ఈమతమునే లింగతత్వమును దెలిసిన మహానుభావులు గూడ వచించిరి.

ఈలింగమునకు-పరమనియు- గూఢమనియు- శరీరాంతర్గత మగులింగమనియు- అనాదియైన క్షేత్రమనియు - అన్నిటికంటె మొదటిదియైన యీశ్వర తేజస్సనియు అని యైదు నామములు గలవు.

విశేషాకారమున కర్మరూపమని చెప్పఁబడు చున్నది. కర్మోదయ దశయం దు సృష్టియును, కర్మాంతమున సంహారమును జరుగుటయే కర్మస్వరూపము. సృష్టిస్థితి లయములకు కారణమైన పంచసాదాఖ్యమే కర్మసాదాఖ్య మని వచింపఁ బడినది.

## సర్వతత్వములకు శివతత్వమే ఆశ్రయము.

ఇన్ని తత్వములకు నొకటియే యాశ్రయమని చెప్పఁబడు చున్నది. అదియే శివత

మాధారం। శివరూపం సమాశ్రితం। అమూర్తంతు మహాసేన శివ సాదాఖ్య మాశ్రితం। మూర్తిరూపం విశేషేణ అమూర్త్యాది సమాశ్రితం। కర్మరూపక్రమేణైవ కర్తృకాదితథావిదుః। అనేనైవ ప్రకారేణ। ఏకైకంతు సమాశ్రితం। తస్మాత్కర్మస్వరూపంతు పంచతత్వాశ్రితం విదుః। సర్వతత్వాత్మకం జ్ఞేయం। తత్వాధారం సమాశ్రితం। ఏవం పంచతత్వ సంయోగేన పంచవక్త్రస్సదా శివ ఇతి॥ తథావాతూల తంత్రే॥ పంచ మూర్తిమయో దేవః। పంచ తత్వాత్మకో భవేత్। మూర్తానాం దేహ భేదైశ్చ గుణైః పంచాననై ర్యుతః॥ తథాగ్రంథాంతరే। ఏక ఏవ పరం బ్రహ్మ। సచ్చిదానంద లక్షణం। జగత్సృష్టి నిమిత్తాయ పంచవక్త్ర యుతం భవేత్। సద్యోజాతో వామదేవోఽఘోరస్తత్పురుషాహ్వయః। ఈశానశ్చేతి పంచైవ లీలయాధారయే చ్ఛివః। సద్యోజాతం ప్రపద్యామి ఇత్యాది పంచ బ్రహ్మమంత్రైశ్చ॥

తథా మృగేంద్ర సూత్రే॥ తద్వపుః పంచభి ర్మంత్రైః పంచ

---

శ్యము. అట్టి శివరూపమే శివసాదమున కాశ్రయము. ఆశివసాదమే అమూర్తసాదమునకాశ్రయము. అమూర్తసాదము మూర్తసాదమున కాధారము. మూర్తసాదము కర్తృసాదమున కాధారము. కర్తృసాదము కర్మ సాదమున కాధారము.

ఈవిధముగ నొకదాని కొకటి పరస్పర సంబంధము గలదు. కావున పంచ శక్తుల నాశ్రయించి కర్మస్వరూపము గలదు. పంచతత్వ సంయోగముచేత పంచ వక్త్రుఁడగు సదాశివుండు విలసిల్లుచున్నాఁడు.

ఈవిషయమును గూర్చి వాతూలాగమమున నిటులఁ జెప్పఁబడి యున్నది.

పంచమూర్తి మయుఁడగు సర్వేశ్వరుఁడు పంచతత్వాత్మకుఁడు. మూర్తి భేదము ననుసరించి గుణములతోడను, పంచ ముఖములతోడను గూడియున్నాఁడు.

జగదుత్పత్తికై సద్యోజాత- వామదేవ- అఘోర- తత్పురుష- ఈశాన ముల పంచముఖములు గలిగి పంచలీలా విగ్రహుఁడై యున్నాఁడని గ్రంథాంతరంబునఁగల

కృత్యోపయోగిభిః। ఈశ తత్పురుషాఘోర వామ సద్యాది నాయకం॥ అథ పంచవక్త్ర పంచ తత్త్వసంయోగ మాహ॥ వాతూలే॥ కర్త్రీశం పూర్వవక్త్రం స్యాత్ కర్తృ స్యాద్దక్షిణాననం। అపరం మూర్తి వక్త్రంతు అమూర్తం చోత్తరాననం। ఊర్ధ్వేతి శివ సాదాఖ్య। మేవం పంచాననం విదుః। షట్కలాశ్చైవ శాస్త్రజ్ఞః। షడంగేషు ప్రకల్పితాః। సర్వాంగైశ్చ సుసంపూర్ణం। సర్వావయవ సంయుతం। సర్వజ్ఞాన మయం దేవం। సర్వకారణ కారణం। ఏవం లింగేతు కర్త్రీశం। ధ్యాయేత్సకల నిష్కళం॥ ఏవం నిష్కళ పరశివ తత్త్వమేవ సవికల్ప మాత్రేణ సకళ నిష్కళం భవతి॥ ఏవంతత్స్మృతి మాత్రేణ మూర్త్యా సకలరూపధృత్। నిష్కళం తదభావేతు। తస్మాత్సకల నిష్కళం। ఏవం సకలనిష్కళ సదాశివతత్త్వస్య సావయవ మూర్తిత్వం చోక్తం॥

---

పంచకృత్యములు నిర్వహించుటకై యా శివతత్త్వ స్వరూపము సద్యోజాత - వామదేవ - అఘోర - తత్పురుష - ఈశాన నామముల ధరించి విలసిల్లు చున్నదని మృగేంద్ర సూత్రమునఁ జెప్పబడినది.

ఆ పంచముఖముల యందుఁ బంచ తత్త్వ సంయోగమును వచింపు చున్నాడు.

పూర్వముఖము కర్త్రీశము - దక్షిణ ముఖము - కర్తృరూపము. పశ్చిమ ముఖము మూర్తి. అమూర్తము - ఉత్తరముఖము. శివసాద మూర్ధ్వముఖము. ఈరీతిగాఁ బంచముఖములను దెలిసికొన వలయును.

షడంగములందుఁ బ్రతిపాదింపఁబడి సర్వావయవ సహితుడై సర్వజ్ఞాన మయుడై సర్వకారణములకుఁ గారణ రూపుఁడగు వానిగా లింగమునందుఁ గర్త్రీశుని సకలనిష్కళ రూపునిగ ధ్యానింప వలయును.

నిష్కళ మగు పరశివతత్త్వమే వికల్పముతోఁ గూడికొని సకల నిష్కళ మగును.

స్మరించిన యంత మాత్రముననే సకల రూపము గలుగుటయు, స్మరించని యెడల నిష్కళ రూపము గలిగి యుండుటయు - ఆ శివతత్త్వ ప్రసాద గుణాతిశయము. ఈవిధముగ సకల నిష్కళ సదాశివతత్త్వమునకు సావయవ మూర్తిత్వము చెప్పఁ బడినది.

## సావయవ మూర్తి విచారః.

తథాంచ భూతాత్మ శరీరత్వం స్యాత్। నహ్యా భౌతికం శరీరం సావయవత్వాత్ శంక్య నభూతారబ్ధ శరీర ముచ్యతే। కింతు॥ యథాకాశే ఇంద్రచాపః దర్పణే ప్రతిబింబ స్తథైవ ధ్యాతౄణాం ధ్యానోపధౌ ప్రతిబింబ ఇతి దృష్టాంత పురస్సరం శుద్ధాఖ్య తంత్రేణ దర్శయతి॥

నవీర్యంచైవ నిర్దేహం। మాంసాస్థి రుధిరంనచ। ఇంద్ర చాపమివాకాశే। దర్పణే ప్రతిబింబవత్॥ తథాశ్రుతయః॥ నీవారశూక వత్తన్వీ పీతా భాస్వత్యణూపమా। ఇత్యాది॥ అపిచ॥ అణోరణీయాన్మహతో మహీయాన్ స్తుహిశ్రుతం గర్తసదం యువానమితి॥ తథా యోగశాస్త్రే॥ హృదయ కుహరమధ్యే దీప వద్భాసమానమితి। ఏవంమనస్సంబంధ నిబంధన మూర్తిత్వం స్మృతేశ్చ ఇత్యేతే మనసా కల్ప్యం సకళం నిష్కళం భవేత్॥ తస్మాన్నాదాత్మకత్వంచ సర్వకారణ కారణం। సదాశివమితి ప్రోక్తమితి శాస్త్రేషు నిశ్చితః। తత్సద్ధేతు మహేశాది సర్వతత్త్వ సముద్భవం। శివాదికర్మ పర్యంతం క్రమేణైవ

---

## సావయవ మూర్తి విచారము.

సదాశివుని శరీరము పాంచభౌతికమేయయి యుండవలయును. గాని యట్లుగాక వేరొక విధముననుండుటకు వీలులేదుగదా! కావున భూతాత్మక శరీరమే సదాశివశరీరమని వచింపఁదగియుండ, నాతని శరీరము భూతారబ్ధమైనది కాదు. ఆకాశమునందు ఇంద్రచాపమువలె నద్దమునందుఁ బ్రతిబింబమువలె ధ్యానము చేయువారలకు ధ్యానమునందా సదాశివుఁడు ప్రతిబింబించునని శుద్ధాఖ్య తంత్రమునఁ గలదు.

అతని మూర్తియందు రక్తమాంసాదులు లేవు. మహాసూక్ష్మమై యణుస్వరూపమైన వరిముల్లువోలె నాతనిరూపము మిలమిల్లును. అణువుకంటె నణువును - మహత్తుకంటె మహత్తును నయియాతఁడు ప్రకాశించును. అని శ్రుతులు చెప్పుచున్నవి. హృదయమధ్యమునందు దీపమువోలెఁ బ్రకాశించుచున్నాఁడని యోగశాస్త్రము చెప్పుచున్నది. మనస్సంబంధముచే తనే సకల నిష్కల రూపము సదాశివునికి నిరూపింపఁబడినది.

ప్రకీర్తితం । సాదాఖ్య లక్షణం ప్రోక్తం ।

మహేశ తత్వస్వరూపం

మహేశం శృణు షణ్ముఖ! మహేశం సకలం విద్యాత్ । సృష్టి స్థితి లయావహం । పంచవింశతి భేదైస్తు తన్మూర్తిః పంచవింశతిః । నానారూప ధరం దేహం । నానారూప సమన్వితం । నానాచిహ్న సమోపేతం నానాలీలా ధరం హరం । అనేకాకార సంయుక్తం దేవదేవం మహేశ్వరం । జటామకుట సంయుక్త । మేకపద్మాసన స్థితం। మహేశ రూపమేవోక్తం। రూపభేదమథోచ్యతే।

మహేశ్వర తత్వరూప భేదాః.

ప్రథమం చంద్రధారీచ। ద్వితీయ ముమయా సహ । తృతీయం తు వృషారూఢం । చతుర్థం నృత్యకోపమం । వైవాహం పంచమం విద్యాత్ । షష్ట భిక్షాటనం భవేత్ । కామారిం సప్తమం విద్యాత్ । కాలారించాష్టమం భవేత్ । నవమం త్రిపురారిస్స్యా జ్జలంధరవధో దశ । ఏకాదశ మజారింస్యా । ద్వాదశం వీరభద్రకం త్రయోదశం హరిధ్వంస । మర్ధనారీ చతుర్దశ । పంచాదశ కిరాతం స్యాత్ । కంకాళం

---

సర్వకారణములకు కారణమైన నాద స్వరూపము సదాశివ మని చెప్ప బడినది. శివుడు మొదలుకొని కర్త పర్యంతమున్న సాదాఖ్య లక్షణము వచింప బడినది.

మ హే శ త త్వ ము .

అనేక రూపములు - అనేక చిహ్నములును - త్రినేత్రములు - జటమకుటము - సర్వాభరణములు- ఏకవక్త్రమునుగలిగి సృష్టి స్థితి లయములకు కారణుడై యిరువది యైదు భేదములు గలిగి మహేశ్వర తత్వము ప్రకాశించును. ఈతత్వమునొక్క లీలా భేదములను వచించెదను.

మూ ర్తి భే ద ము లు .

చంద్రధారణలీల- ఉమామహేశ్వర లీల- వృషభ వాహన లీల- నటేశ్వర లీల వైవాహిక లీల- భిక్షాటన లీల- కామారి లీల- కాలారిలీల- త్రిపురారిలీల- జలంధరారి-

షోడశం భవేత్ । చండీశానుగ్రహంచైవ । తథాసప్తదశం భవేత్ । వి షాపహరణం చైవ అష్టాదశ మితిస్మృతం । చక్రదాన స్వరూపంతు ఏ కో నవింశతి స్మృతం । విఘ్నప్రసాదా వింశత్యా । ఉమా స్కందేకవిం శతిః । ద్వావింశ త్యేక పాదం స్యా । త్రయోవింశ త్సుఖాసనం । ద క్షిణామూర్తి రూపంతు । చతుర్వింశదితి స్మృతం । ఉరు లింగోద్భవం రూపం । పంచ వింశతి నామకం । ఏతే మహేశ రూపస్య । మూర్తి భేదాః ప్రకీర్తితాః । పంచవింశ ప్రకారేణ రూపం ప్రతి పృథక్ పృ థక్ । సమ్యకళస్య శివస్యైవ । సాదాఖ్యస్య మహేశితుః ఇతి సంక్షేప రూపేణ । తత్వభేదాః ప్రకీర్తితాః ॥

కృత్య భేద నిరూపణం.

ఏవంవిధం పరస్వరూపం కథయిత్వాతతః తత్కృత్య భేదం మృ గేంద్ర సూత్రేణ దర్శయతి । సదనుగ్రహ మేవ కరణే నాహం తై జసా । కరోతి సర్వదా కృత్యం । యథా యదుపపద్యతే ॥ అథసృష్టి కాలే పత్యు రేకస్యైవ శక్తేర్వ్యక్త ప్రవృత్తి భేదః ఔపచారిక ఇతి ద ర్శయతి ।

తథాగమ సూత్రేణైవ శక్తేర్వ్యక్తః ప్రవృత్తశ్చ । కర్తా ప్రవి

---

లీల. అజారిలీల- వీరభద్ర లీల- హరిధ్వంసిలీల. అర్ధనారీశ్వరలీల- కిరాతలీల- కంకాళధర లీల- చండీశాను గ్రహలీల- విషాపహరణలీల. చక్ర ప్రదానలీల- విఘ్నప్రసాద లీల- ఉమా స్కందలీల- ఏకపాదలీల- సుఖాసనలీల-దక్షిణామూర్తి లీల-ఉరు లింగోద్భవలీల- అనియా యిరువదియైదును మహేశ్వరుని మూర్తి భేదములని చెప్పఁబడినవి.

కృత్యభేద నిరూపణము.

ఈవిధముగ శివసదాశివ మహేశ్వరుల తత్వభేదములని సంక్షేపముగ చెప్పఁబడినది. అం ఇఁక దత్వత్రయము నొసగ్గు కార్యభేదమును మృగేంద్రసూత్రమున నిరూపి చుచున్నాము.

ధ ఇష్యతే । శక్తిః ప్రవృత్తి భేదేన । భేదస్త్వస్యోపచారతః । కర్తా బిందుక్షోభాధికార్య విధాతా పరమేశ్వరః । శక్తః ఉద్యుక్తః ప్రవృత్తశ్చేతి త్రివిధ ఇష్యతే । త్రిధా భిద్యతే శక్తిః ప్రవృత్తిభేదేన ఉద్యోగాది వ్యాపారం వినా కార్యే ఉదాసీనతా కార్యే ఉద్యోగః కార్యే ప్రవృత్తిః ఇతి వ్యాపారాణాం భేదేనతస్య పరమేశ్వరస్య భేదః । శక్తోద్యుక్త ప్రవృత్తి భేదః । ఉపచారతః ఉద్యోగాది క్రియాంతర్భావ్య స్వరూపదీపిత శక్తియుక్తః । ఉద్యోగాది క్రియా యుక్త శక్తిసహితః । ప్రవృత్తి క్రియాయుక్త శక్తిసహితః ఇతి ఉపచార దశయా కథ్యతే అనేన ప్రకారేణ ఉక్తలక్షణేన పత్యా విధీయమాన కృత్యస్య కిము పాదానం కిం సహకారీ త్యాశంక్య తద్ద్వయం కథయితుం కారణ త్రియం విభజ్య తన్నిరూపణ వ్యాజేన అభిన్నోపాదానానంగీకారం పరాఖ్యసూత్రేణ దర్శయతి ॥

---

తా: మూర్తి సహితుఁడగు పతి శక్తుఁడనియుఁ, ఉద్యుక్తుఁడనియుఁ బ్రవృత్తుఁడనియుఁ త్రివిధముగ జెప్పఁబడుచున్నాఁడు. బిందుక్షోభాధికారి యతఁడే. అతని శక్తియే త్రిధము. వ్యాపార భేదము వలననే శక్తోద్యుక్త ప్రవృత్తత్వ భేదము గల్గినది.

ప్రయత్నాది వ్యాపారమును విడిచి స్వరూపమున బ్రకాశింపఁ బడిన శక్తితోఁ గూడియుండుటయొకటి— ప్రయత్నాది వ్యాపారము గలిగి యుండుట వేఱొకటి— ప్రవృత్తి క్రియతోఁ గూడియుండుట మఱొకటి.

అఁగా నీదేవి యొక కార్యము విషయమై ఉదాసీనత— ఉద్యోగము— ప్రవృత్తి— అను వ్యాపారములు గల్గిన వాడయిన శక్తుఁడు— ఉద్యుక్తుఁడు— ప్రవృత్తుఁడు— అని చెప్పఁబడును.

ఇట్టి లక్షణము గల పరమేశ్వరునిచేఁ జేయఁబడు కార్యము నకు సహకారి కారణమేది? ఉపాదాన కారణమేది? యని శంకించుకొని యీరెంటిని జెప్పుటకుఁ గారణ త్రయము విభజించి వాని నిరూపించు మిషచే అభిన్నోపాదా నకారణ మందనంగీకారమును పరాఖ్య సూత్రమున సాధించుచున్నాఁడు.

శ్లో॥ నిమిత్త మీశ్వరాఖ్యంచ । అదృష్టంసహకారణం। ఉపాదానం చ యత్సూక్ష్మం సర్వ కార్యేతు సంయుతం ॥ ఈశ్వరాఖ్యస్య జ్ఞానక్రియారూపైశ్వర్యవత్వాత్ ఈశ్వరాఖ్యం పతిః । నిమిత్తం నిమిత్తకారణ మదృష్టం కర్మ సహకారణం సహకారికారణం। నిమిత్త మీశ్వరస్తేషాముపాదానం సబిందురాట్ । స్వకర్మసహకారి స్యాత్కార్య మేతత్త్రిహేతుకం । ఇతి పరాఖ్య సూత్రే షష్టపటలే సూత్రాంతరస్థితే హేతునాచ కల్ప్యతేసఏవ ఉపాదానం సహకారిచ తద్వయం సహకారి త్రిరణే శక్తౌకార్యస్య వశస్థితే ఇతిద్వితీయ పటలేచ సహకార్యుపాదానేశక్తి ప్రేర్యఇతి ప్రతిపాదన కారణేన స్వకర్మ సహకారి స్యాదితి పౌష్కరాగమేచ । ఈశ విద్యాద్యపేక్షత్వా త్సహకారి తను చ్యత ఇతి మృగేంద్రేచ కర్మసహకారి కారణమితి ప్రతిపాదనేన అస్మిన్ సూత్రే అదృష్టశబ్దస్య శక్త్యర్థో నభవతి;కర్మైవార్థస్యాత్ । సూక్ష్మా నిరవయవ మాయా ఉపాదానంచ ఉపాదానకారణం ఇతియత్ యదస్తితత్ కారణత్రయం సర్వ కార్యేతు సహితంయుజ్యతేస్మ। అస్యపత్యుః శక్తి వ్యాపార రూప కృత్యాని కతివిధా నీత్యాశంక్య పంచవిధాన్యేవేతి మృగేంద్ర సూత్రేణ దర్శయతి॥

పంచ కృత్య నిరూపణం.

శ్లో॥ జగజ్జన్మ స్థితిధ్వంసతిరోభావ విముక్తయః। కృత్యం సకారక ఫ

---

తా॥ కార్యమును గురించి పరమేశ్వరుడు నిమిత్త కారణము. కర్మ సహకారి కారణము. నిరవయవమగు మాయయే యుపాదాన కారణము. ఈరీతిగ సర్వ కార్యము లుందగు చున్నది.

పంచ కృత్య నిరూపణా.

అ॥ ఈపతికి శక్తివ్యాపార రూపములగు కృత్యము లెన్నివిధములని యాశంకించి

